



# రాక్షసవివాహం

వి.వి.యల్.ప్రభాకర్



# రాక్షసవివాహం!

రచయిత:

వి. వి. యల్. ప్రభాకర్, బి.యే.

ప్రచురణ:
అనసూయా పబ్లికేషన్స్
32, రామన్ వీధి,
త్యాగరాయనగర్, మద్రాసు - 17

# ప్రస్థానం!

ప్రభాకర్ అల్పవయస్సువాడై నపుడే, నాకు పరిచితుడై. నా మనస్సు వశంచేసుకోగలిగా డంటే, అదే మంత్రశక్తో, మరి. యిది అనేకమందికి తెలియని విషయం. ఎంచేతంటే, ఆతన్ని, బాహ్యావర్తన్ని బట్టి అర్థం చేసుకుందామని ప్రయత్నిస్తే, లభ్యం అవడు. అతని మనస్సు వాల్మీకంలోని శుప్తభుజంగంలాంటిది. అసలు తల్లీ తోడే, అతని అపురూప మనోవృత్తికి చెందిన ప్రతిభను, తెలుసుకోలేరు సరిగదా, అవజ్ఞుడనికూడా అనుకుంటూంటారు. అతనికి ప్రపంచికంతో సంబంధం తక్కువ. తన అంతరాత్మే తనకుచాలు; ఎవరేమనుకున్నా, లోకులు విమర్శించినా, ఆప్తులు తప్పు పట్టినాకూడా, అది ఎలా చెపుతే అలా చేస్తాడు. అంతరాత్మ తప్పుచెయ్యదని అతనికి తెలుసును.

ప్రభాకర్ వ్రాసిన నాటకం, "రాక్షస వివాహం"; అనే నామకరణలోనే ఒక వైచిత్రి, హాస్యమూ, భావబంధురంగా మనల్ని రెచ్చగొడతాయి. దాన్ని చదివాక, నా కెన్నెన్నో భావాలు కలిగాయి. సాధారణమైన దృష్టితో ఈ నాటకాన్ని చదువుతే, అస్వాభావికంగానూ, అశ్లీలంగానూ కూడా కనబడ వచ్చును. కాని, సహృదయంతో, విమర్శకా దృష్టితో, రచయిత ప్రత్యేక ప్రతిభేమిటో, ఈ నాటకాన్ని ఏ దృక్పథంనుంచి అవలోకించి రచించాడో, తెలుసుకొని ఆ మార్గంలోనే, మనంకూడా నాటకాన్ని అవగాహన చేసుకోకపోతే, రచయితకు అన్యాయం

చేసినవాళ్ళం అవుతాం. రచయితన్నవాడికి ఏవిధంగానూ అన్యాయం జరగడం నేనంగీకరించలేను.

'ఏం చెయ్యమంటారు చెప్పండి?' అన్న ఉపోద్ఘాతంలో ఎన్నిమార్లు చెప్పినా, ఆటంబాంబులు, అన్య గ్రహాలకు పోయే కృత్రిమ గ్రహాలు, శబ్దంకన్నా వెలుతురుకన్నా వేగంగా ప్రసరించే 'రాకెట్స్', భయానకం, భీభత్సం—అవన్నీ ప్రభాకర్ అంతగా పదేపదే ఎందుకు మర్దించాడో తెలుసుకోడానికి మనం ప్రయత్నించాలి. 1945-లో జపానులో రెండు పట్టణాలు, ఆటం బాంబులు పడి దగ్ధం అయాయని, చరిత్ర చెబుతూంది. కాని, అవేకాదు, ప్రపంచకంలోని అన్ని పట్టణాలూ, పట్టవాస నాగరకత, మానవుల మనోజగత్తూకూడా, ఆటం శక్తి ఆగమనంతో, దగ్ధపటలం అయిపోయాయని రచయిత నమ్మకం. ఇప్పుడు పల్లెల్లో ఎల్లా ఉన్నా, వయస్సొచ్చి, సంస్కరణ గలిగి, పట్టవాసానికివచ్చే ప్రతియువకుడూ, కనీసం రెండు 'సూట్ కేసెస్'తో ప్రవేశిస్తాడు—'The two suit cases filled with despair!' మానవుడిలో ఇదివరకెన్నడూ కలగని భయోత్పాతం, బుద్ధి నధిగమించి, వ్యక్తావ్యక్తాన్ని (sub-conscious) దాటి, అవ్యక్తం (unconscious) లో ప్రవేశించి, ప్రతి పురుషుణ్ణీ నిర్వీర్యంచేసింది. అవ్యక్తంలో ఉన్నది, మనం తెలుసుకోలేం. ఎంచేతంటే, నీలోనూ, నాలోనూ ఉన్న 'super ego' దాన్ని తెలుసుకునేందుకు అవకాశం ఇవ్వదు. అందుకే ప్రభాకర్, 'బ్రహ్మచర్యం' అని, 'బ్రహ్మచర్య రహస్యం' అనీ, పదేపదేఅనడానికి కారణం.

ఈ ఆటంబాంబుల యుగంలో, మానవుడిలో జొరబడిన భీతాహంయొక్క పర్యవసాన్ని, 'రాక్షసవివాహం', ఒక సాంకేతిక దృష్టితో తెలియజేస్తుంది. సహజ ప్రకృతిని మార్చివేసి, ఒక అసహజత్వాన్ని మానవత్వపు లోతుల్లోంచి పైకుబికించడం, ఆటంబాంబు ఫలితం. ఆటంబాంబుల ప్రయోగం, ఇంకా, ఇలా జరుగుతూంటే, క్రమక్రమంగా, కొన్నాళ్ళకి, వేయికళ్ళతో పురుషతత్వాన్ని వెతుక్కుంటూవచ్చే స్త్రీ తత్వం, పురుష తత్వంగానూ, పురుషతత్వం స్త్రీతత్వంగానూ మారక తప్పదు అన్న విషయాన్ని ప్రభాకర్ తన కథావస్తువుగా గ్రహించాడు.

అబద్ధం ఆడకుండా చెప్పాలంటే, 'రా క్ష స వి వా హ ం' లో ని స్త్రీ పాత్ర ప్రభాకర్, పురుష పాత్ర పద్మిని. ఒకప్పుడు, మన పురాణాల్లో, ఈ శ్వ రు డి తపస్సు, పార్వతి ప్రేమించడం, మన్మధుడు ఈశ్వరుడిమీద పుష్పబాణాలు వేయడం, ఈశ్వరుడు తన ఫాలనేత్రం విప్పి, మన్మధ దహనం చెయ్యడం, రతీదేవి కన్నీటిచేత దగ్ధమైన మన్మధుడు, అనంగుడైనా సజీవుడవడమూ, అందరికీ తెలిసిన కథే. ఆనాడు జరిగింది, మన్మధదహనం; 'రాక్షస వివాహం'లో జరిగింది రతీదహనం. ఇక్కడ ప్రభాకర్ తన భయంచేత, కన్నీటిచేత, రతీదేవిని బ్రతికిస్తాడు. ఇంతకన్న, ఆశ్చర్యం కలిగించే కథావస్తువు మరొకటేం కావాలి? నాటక లక్షణాన్ని చెపుతూ, ప్లాటో "All source of Philosophy—Wonder!" అన్నాడు. ఈ 'ప్లాటోనిక్ వండర్' మనకు 'రాక్షస వివాహం'లో

సాక్షాత్కరిస్తుంది. ఇదెలా లభ్యమవుతుందంటే; చిరపరిచిత మైన వస్తువుల్ని అపరిచితమైన కోణాల్నుంచి ఆపాదించి వ్యక్తీకరించకలుగుతేనే. ఈ 'వండర్' 'రాక్షస వివాహం'లో పుష్కలం.

మానవులు పాపంచేస్తే, దేవతలుమన్నిస్తారని అంటారు. అలాగే దేవతలుకూడా ఒక్కొక్కప్పుడు, స్త్రీ విషయంలో పొరపాటుచేస్తే, (వాళ్ళకి అది అలవాటే!) మానవుడే దానికి విరుగుడు కల్పించవలసి వస్తూంది. రుక్మిణి నపహరించి, రాక్షస వివాహం చేసికొన్న శ్రీ కృష్ణుని తప్పును, ప్రభాకర్ ఈ నాడనుభవించి, సంతప్త హృదయుడై నాడు. అందుకే, ఇది 'రాక్షస వివాహం' అన్నాడు. దేశంలోని అవివాహితయువకులందరికీ ప్రభాకర్, స్త్రీజాతిలో కలిగిన, అస్వాభావిక, నవీన నాగరకతకాహుతియైన, నారీ పిశాచులందరికీ, పద్మినీ, చిహ్నాలు.

రచన సాంకేతికమైనపుడు, యదార్థం కానక్కరలేదు. అయినా, అది, ఆశ్చర్యకరమైన ఒక వింత హాస్యాన్ని మన మనస్సుల్లో వివిధరీతుల్లో మూర్ఛనలుజేస్తుంది. నీరసించిన రసంకంటె రక్తికట్టేరసాభాసమే ఉత్తమం కనక, ప్రభాకర్ దానినేకలిగించాడు. పూర్వపు నాటకాల్లో రసాభాసాన్ని ఒక పాత్రద్వారా చూపించేవారు. 'మృచ్ఛకటికం'లో శకారుడిలాగ. కాని, ఒక నాటకం అంతా రసాభాసంకోసమే ఉద్దేశించి రక్తికట్టించడం సాధారణ విషయం కాదు. అందులో ప్రభాకర్ కృతకృత్యుడై నాడు. సంగీతంలో discord నుంచి concord, cocophony

నుంచి symphony, ఎలా ఉద్భవిస్తాయో, అలాగే, రచయిత శక్తియుతుడవుతే, రసాభాసంనుంచికూడా, ఒక అపూర్వరసాన్ని సృష్టిస్తాడు. ఈ విషయంలో ప్రభాకర్ది ఆరితేరిన చెయ్యని, 'రాక్షస వివాహం' రుజువు చేస్తుంది.

కొన్ని సందర్భాల్లో, రచయిత తన సంభాషణల్లో 'నిరాయుధుణ్ణి' అని వాడుతూవచ్చాడు. దేశమే ఇల్లుగానూ, దానిలో నివసించే యువకులందరికీ తాను చిహ్నంగానూ ప్రభాకర్ నిలిచి, అన్ని దేశాలూ science లో ముందంజ వేసి, ఆటం బాంబులు తయారుచేసి, 'రెడీ'గా ఉంటూన్నా, మనదేశంవారు మాత్రం చైనా మన పొలిమేరలకొచ్చి దురాక్రమణ సాగిస్తూన్నా, నిరాయుధులుగానే ఉండిపోయారే, ఎంతో వెనకబడిపోయారే, అన్న అభిప్రాయంతో ప్రభాకర్ పదేపదే, 'నిరాయుధుణ్ణి' అన్నాడనుపిస్తుంది. రచయిత ఆయుధ విసర్జనమే కోరేవాడయినా, దేశపరిస్థితి ఇది కనక, యదార్థం చెప్పాడు. అయితే, ఈనాటకంలో హృదయతత్వశాస్త్రం (Psycho-analysis) పునాది. పెద్దదై పెండ్లికాని ఆడుది బద్ధలైన ఆటం బాంబులాంటిది! ప్రతి పురుషుడు హిరోషీమాపట్టణంలాంటివాడు. అందుకే స్త్రీ శక్తి స్వరూపిణి. ఎదురు తిరుగుతే మానవజాతినే హతమార్చగలదు. "Fragile as a flower, and, dangerous as ammunition!" అన్నారు, స్త్రీని. స్త్రీలో, అమృతం, హాలాహలంకూడా ఉన్నాయి. పూర్వకాలంలో ఎలాగున్నా, ఈకాలంలో స్త్రీ హృదయంలో అమృతం ఇంకిపోయి, హాలాహలం విజృంభిస్తూన్నట్లు తోస్తూంది.

నాటకం ఆఖరి ఘట్టంలో, పద్మినివచ్చి, బలాత్కారంగా తనకు పుస్తి కడుతూన్నప్పుడు, ప్రభాకర్ వద్దని వారిస్తాడు; మూర్ఛపోతాడుకూడా. దీనికి కారణం, ఉరిత్రాడైనా తెగి, మనిషి బ్రతికేందుకుఅవకాశం ఉందికాని, పుస్తిత్రాడు మాత్రం తెగదు! గొలుసులుతెంపే కోడె రామమూర్తి అయినా దాన్ని తెంపలేడు. అలాగే, పద్మిని పుస్తికట్టేస్తూంటే, "క్లోరోఫారం ఇవ్వకుండానే! ఈ ఆపరేషన్?" అంటాడు ప్రభాకర్. ఈ మాటలు, ఉత్కృష్ట ఫ్రెంచి కవి, బోద్లియార్ రతిని వర్ణిస్తూ "like surgical operation" అన్న మాటలు మన స్మృతిపథానికి తెస్తాయి.

ప్రభాకర రచించిన నాటకాలూ, కథలూ, వ్యాసాలూ, చాలా ఉన్నాయి. కాని, వాటిని ప్రకటించడం అవసరమని అత నెప్పుడూ అనుకోలేదు. తెలివి తేటలుండి, రచనా సామర్థ్యం ఉండికూడా, ఇతడజ్ఞాతంగా ఉండి పోవడానికి, ఇదొక కారణం, ఈ నాటకం ప్రచురించడానికి, అతని తండ్రి శ్రీ వింజమూరి లక్ష్మీ నరసింహారావుగారి ప్రోద్బలము, మేనమామ శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి అభిమానమూ కారణాలు. ఈ నాటకమంతా చదివాక, ఒకే వాక్యంలో నా అభిప్రాయం చెప్పాలంటే...
In an Age of Atom Bombs, the quest and conquest of a potent Mother-cell over an impotent Protoplasm-Daddy!.

మద్రాసు
1-5-1960

శ్రీరంగం - నారాయణబాబు

# ఏం చెయ్యమంటారు చెప్పండి, మరి?



ఏం చెయ్యమంటారు చెప్పండి మరి? ఇది యంత్రజగం! 'జెట్ ప్లేన్స్', 'గైడెడ్ మిసిలీస్'. 'ఐ. సి. బి. యమ్స్', 'ఇంటర్ ప్లానెటరీ రాకెట్స్' - ఒకదాన్నిమించి ఒకటి, 'సౌండ్'కన్నా, 'లైట్'కన్నా, వేగంగా ఎగిరి, అనుకున్నచోట అమాంతంగా అవరోహించే 'ఆటం'యుగం! ఈ యంత్రాలన్నీ చుట్టుముట్టి ఆవహించడంవల్ల, ఈనాటి మానవుడికి వాటి తత్వం సంక్రమించి, మునపటి తీరిక, ఓపికా తగ్గాయి; తొందరపాటు హెచ్చింది; ఏపనీ సావకాశంగా ఆలోచించి చేయడానికి అవకాశమే దొరకడం దుర్లభం అవుతూంది. మన తాతముత్తాతల్లాగ, తెల్లవారుజామున లేచి, కాలకృత్యాలు తీర్చుకొని, స్తిమితంగా స్నానము, పూజాపురస్కారాలు, భోజనమూ చేసి, విశ్రాంతి తీసికొనే రోజులుపోయాయి. కాలకృత్యాలు, స్నానపానాదులు, 'టాయిలెట్'-అన్నీ అరగంటలోముగించి, భోజనం ఎంత దిట్టంగా దట్టించినా 5, 10 నిమిషాల్లోనే కానిచ్చెయ్యాలి. ఇంక 'రెస్ట్' అనేది కుర్చీలకు, బల్లలకేకాని మీకూనాకూకాదు. ఈ అశాంతిలో, ప్రశాంతికి, విశ్రాంతికీ తావేది? కాలం 'జెట్ ప్లేన్'కన్న వేగంగా పరుగెత్తుతూంది. కాలంతోపాటు మనమూనూ. తప్పదు; ఏంచేస్తాం?

అలాగే, మన నిత్యజీవితంలో అన్ని రంగాల్లోనూ అంతా తొందరే. ఎప్పుడూ తేళ్ళూ, జెఱ్ఱులూ పాకినట్లుంటుంది! ఏదైనా అనుకుంటే, ఆక్షణంలోనే అయిపోవాలి. పసిఫిక్‌లో

వదిలిన ఐ.సి.బి.యమ్, 5 నిమిషాల్లో అట్లాంటిక్ లో పడవలసిందే! కాఫీకలపడం ఏమిటి, మరుగులైనాసరే, మరుక్షణంలో గుటుక్కున మ్రింగవలసిందే! గబగబ సంక్రమించిన గాలిపాటు ఆస్తులు, టక టక ఖర్చైయిపోవలసిందే! ప్రపంచ యుద్ధమైనాసరే, మునపటి లాగ పదేళ్ళపాటుజరుగక, పరమాణు ప్రభావంచేత, 10 రోజుల్లోనో, 10 గంటల్లోనో, మళ్ళీమాట్లాడితే 10 నిమిషాల్లోనో ముగియవలసిందే! ఇదిగో వస్తున్నానంటే కుదరదిప్పుడు; వచ్చి 'రెడీగా' ఉండవలసిందే! 20 వ శతాబ్దపు ప్రపంచకం, 'జట్ ప్రొపల్షన్' మీద నడుస్తూంది.

పరమాణు శక్తి, ఆకాశానికి భూమికి వారధి వేసింది; దేశాన్నీదేశాన్నీ, మనిషినీమనిషినీ కలిపి మూటకట్టింది; అన్నిటికీ అన్నీ, అందరకూఅందరూ సన్నిహితులై పోయారు. అందువల్ల, పూజారులు, పురోహితులు--ఇత్యాది మధ్యవర్తులందరూ పింఛను పుచ్చుకోవలసివస్తూంది.

ఈ ఒడుదుడుకు వివాహరంగంలోకికూడా వచ్చిపడింది కొంప ముంచడానికి! పరమాణుశక్తి ప్రళయానికీ, ప్రణయానికీ కూడా వంతెన కట్టేసింది. వధూవరుల కులగోత్రాలేమిటో, చదువుసంధ్యలు, ఆస్తిపాస్తులూ ఏమిటో, తలిదండ్రులు తెలిసికొని, సంబంధం నిశ్చయించడం (వాళ్ళకి తప్పినశ్రమ అదొకటే), పురోహితుడు సుముహూర్తం పెట్టడం (పురోహితుడు పెన్షనర్), అగ్నిసాక్షిగా వివాహం జరపడమూ (అగ్ని రగిలేలోగా, పెళ్ళైఅయిపోతుందే!)ఆనాటిమాట. 'ఫ్లర్టింగ్'లూ, 'ప్రూయింగ్'

లూ లేకుండా, సరాసరిని, ఏకాఏకని, 'లవింగ్' లేక 'ఇలో పింగ్'లే ఈనాటి రివాజు. అలా ప్రేమించడం ఏమిటి, ఇలా పెళ్లాడడమే! అలా సంబంధాలుకావడం ఏమిటి, ఇలా బంధాలు పడడమే!

ఈ పరమాద్భుత ప్రణయ ప్రభావం, కథానాయిక పద్మిని పైన ప్రళయంగా ప్రసరించి, ఉజ్జ్వలంగా ప్రజ్వలించింది. ఆ జ్వాలకు ఆహుతైపోయిన మిడత, కథానాయకుడు ప్రభాకర్. ఇక్కడ మిడతనిమ్రింగిన జ్వాలదితప్పా, జ్వాలలోపడిన మిడతదే తప్పా? అంటే, ఇద్దరిదీ కాదనాలి. సాలెపట్టులో చిక్కుకున్న ఈగదా, సాలెదా తప్పు?—అన్నట్టు! అయాచితంగా తన పట్టులో చిక్కిన ఈగని, ఏసాలెపురుగైనా వదులుతుందా? కట్లు మరింత బిగిస్తుంది. అది ప్రకృతి ధర్మం. పాపం, ఈగదీ తప్పుకాదు; కన్నులపండుగగా కనుపిస్తూన్న వలలో, కాస్త విశ్రాంతి తీసుకుందామని, వాలుతుంది, ఆసాలె 'హేమక్'లో 'హేవక్' జరుగుతుందని తెలియక! ఇలాంటి సంఘటనలు ప్రకృతిసిద్ధాలే కాని, విరుద్ధాలుకావు. ఏం చెయ్యాం మరి? కొందరికి ప్రేమకూడా ఓరకం ఆటే! ఓరకం బాహాటమే! అది తీరకపోతే వారు తిరగబడతారు, విరగబడతారు- అలా నిగ్రహంలేనివారిలో ప్రథమురాలైన ప్రణయ తపస్విని పద్మినిని, సకాలంలో అనుగ్రహించక, ఆమె ఆగ్రహానికి, సత్యాగ్రహానికీకూడా గురి అయాడు, ప్రభాకర్. .

'న్యూక్లియర్ టెస్ట్స్'వల్ల కాబోలు, ప్రపంచకంలోని ప్రేమంతా, 'రేడియో ఆక్టివ్' అయిపోయింది. ప్రేమపాలు అధి

కంగా ఉన్న పద్మినికూడా 'రేడియో ఆక్టివ్' అయింది. గట్టు తెగిప్రవహిస్తూన్న ప్రేమతోనిండిన తనగుండెను అయాచితంగా అర్పిస్తూంటే, ఏమాత్రమూ చలనము, 'షివల్రీ', 'రియాక్షన్' లేకుండా బుద్ధవిగ్రహంలాగ, స్తబ్ధంలాగఉండిపోయాడు ప్రభాకర్. వెంటనే ప్రణయవిప్లవం బయలుదేరి, పద్మినిలోని ఆకర్షణశక్తులు అతనిమీదికి దండెత్తివచ్చాయి; చిత్తయాడు.

పద్మినిలాంటి 'డైనమిక్ హీరోయిన్', ప్రభాకర్‌లాంటి 'స్టాటిక్ హీరో' ఈలోకంలో ఉండరని, చాలా అసహజము, అసంభవమూ అనీ అనుకుంటారేమో! సహజము, సంభవమూ అయి, ఎక్కడపడితే అక్కడేకనబడుతూండే సాధారణ నాయికా నాయకులే అయితే, ఊరూరా, ఇంటింటా, రోజూరోజూ చూస్తూనే ఉంటాం. ఆ మాత్రానికి వేరే నాటకం ఎందుకు? ఏకళయినా ప్రకృతిని కొంత అతిశయోక్తిగా ప్రదర్శిస్తేనే, అది రక్తి కట్టుతుంది. ఉన్నదున్నట్లు, 'ఫోటోగ్రాఫీ'లాగ ప్రదర్శించడానికి ప్రత్యేక ప్రతిభ అవసరంలేదు. ఏదైనా ఒక అసామాన్యాన్ని, అపూర్వాన్ని, అమూల్యాన్ని, ఆదర్శాన్నీ ప్రేక్షకుల కళ్లకి కట్టగలిగితేనే, నాటకం సార్థకం.

చేసిచేసి, రాక్షస వివాహమా?—అని సంశయించకండి. ఇంతకీ ఇది, అష్టవిధ వివాహాల్లోని రాక్షసవివాహం కాదు. నా 'రాక్షస' శబ్దం విశేషణం. కాలం మార్పునుబట్టి, వివాహాల రకాలుకూడా మారుతూనే ఉంటాయి, ఊసరవల్లి రంగుల్లాగ, రాజకీయవేత్తల ఎత్తుల్లాగ! ఇదివరకే, 5 రోజుల పెళ్లిళ్లు వెనుక

బడి, ఒకరోజు పెళ్ళిళ్లు అమలులోకి వచ్చాయి. ఇప్పుడు 'ఆటమిక్ ఏజ్' ఆగమనంతో ఆ ఒకరోజుకూడా ఒక యుగంగా అనుపిస్తూంది, వధూవరులకు ప్రేక్షకులకూ. మంత్రతంత్రాలతో మూడుముళ్ళూ పడేసదాకా, ఓపికపట్టలేకపోతూన్నారు. అందుకే, ప్రభాకర్ చేసే జాప్యానికి తట్టుకోలేక, పుస్తికట్టడానికి 5 నిమిషాలు మాత్రమే గడువిచ్చింది పద్మిని; ఆ 'అల్టిమేటమ్' ముగిసి, 'జీరో అవర్' రాగానే ఎదురుతిరిగి, తానే తనహారాన్ని 'సూపర్ సానిక్ స్పీడ్'తో, ప్రభాకర్ మెడకి పుస్తిగా కిట్టేసింది.

ఆఖరికి ఆపుస్తికట్టే గౌరవమైనా, పురుషుడికి దక్కుఉండవలసిందే!—అనిపించవచ్చు, పౌరుషవంతులు కొందరికి. మంచిదే. కాని, ఎలాగ? ప్రభాకర్కి ఆ 'క్రెడిట్' తనకే రావాలన్న ఆశ, ఆ వుత్సాహం లేవే! మరొకవిషయం గమనించాలి. సత్తెకాలపు పెళ్లికొమార్తెలు వల్లమాలిన సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ తలవంచుకుని ఉన్నంతకాలమూ, పురుషుడి గౌరవం దక్కింది. విజృంభించగలిగాడు. ఇప్పుడారోజులు మారాయి. తలక్రిందులయాయి. ప్రేమించి వల్లోవేసుకునే 'పోర్టుఫోలియో'-'ఇనిషియేటివ్ ఆఫ్ రొమాన్స్'—స్త్రీ తీసికొని, అసలు పెళ్లిబరువంతా -'ఇనిషియేటివ్ ఆఫ్ మేరేజ్'—అంతా పురుషుడిమీద పడేసి ఊరుకుంది.

ఈ తారుమారు పరిస్థితికి తగిన కారణాలు లేకపోలేదు. నవ్యస్త్రీల 'సొసైటీ మేకప్'ను పూర్తిగా అనుకరించడంవల్ల, తళతళకోసం ముఖాన్నెప్పుడూ వికేశంచేసి, బృహన్నలలాగ ఉండడానికి తంటాలుపడుతూండడంవల్ల, 'సినీమా ఇన్ఫ్లుయన్స్'లోపడిపోయి, స్త్రైణపుపాలు అధికమై, స్త్రీలకు ఎక్కువ సన్ని

హితుడైన ఏ అశోక్ కుమార్ నో ఆదర్శమూర్తిగా ఆరాధించడంవల్ల, పురుషులకు అసహజమైన 'ఎఫిమినేట్' నాజూకు బలవంతాన్ని అలవరచుకోడానికి కృషి చేస్తూండడంవల్లా, నవీన పురుషుడు సగంపైగా స్త్రీయే అనాలి. స్త్రీల శృంగారము, ఒయ్యారమూ అబ్బకపోయినా, వాళ్ళ వెకిలితనము, అబలాత్వమూ కొంతవరకున్నూ, వాళ్ళసిగ్గుమాత్రపు పూర్తిగానూ, పురుషుణ్ణి ఆవహించాయి. పౌరుషం ఆ'సైడ్'కి 'ట్రాన్స్‌ఫర్' అయింది. 'బేలన్స్ ఆఫ్ పవర్' 'టాప్సీటర్వీ' అయిపోయింది. 20 వ శతాబ్దపు పెళ్ళికూతురు, కారులో (పల్లకీలు లేవు కనుక) నిటారుగా, నిర్లక్ష్యంగా కూర్చుంటే, ప్రక్కనున్న పెళ్ళికొడుకు మాత్రం, ఎక్కడ ఒళ్ళు తగులుతే ఏ 'లిటిగేషన్'లో పడతామో అన్నట్లుగా, కుదించుకుపోయి కూర్చుంటాడు. పెళ్ళికొడుకు దోసెడు తలంబ్రాలు పోసేలోగా, పెళ్ళికూతురు రాసెడు అభిషేకిస్తుంది. వధువు చదువు సగంసగం అయినా, ఝుమాయించి వాగేస్తూంటే, వరుడులోంచి 'వర్డ్' ఊడిపడదు.

వధువెవరో వరుడెవరో పోల్చుకోవడమే కష్టంగా ఉన్న యీ క్లిష్ట పరిస్థితుల్లో, మంగళసూత్రం ఎవరు కట్టాలీ, అన్న 'లాపాయింట్' నిర్ణయించలేము. ఎవరికెక్కువ పౌరుషము, జబ్బపుష్టి ఉంటే, వారే దాన్ని కట్టేస్తారు. చేతికి చిక్కిన ఏ త్రాడునైనా, మంగళసూత్రంగా మార్చిపారేస్తారు. ఏం కొంప మునిగింది? నిజంగా పెళ్ళవడం కావాలి కాని, ఏ 'ప్రోసెస్'లో అయితే మనకేం? దారులు మారాయి కాని, గమ్యస్థానం ఒకటేగా?

వి. వి. యల్. ప్రభాకర్.

# రాక్షస వివాహం!

ఒకటో రంగం

(ప్రభాకర్ టేబిల్ లైట్ దగ్గర "బ్రహ్మచర్య రహస్యం" అనే గ్రంథం తనలోతను చదువుకుంటూంటాడు. అతని మిత్రుడు రజని ప్రవేశిస్తాడు.)

రజని:—ఏమిటోయ్ ప్రభా!

ప్రభాకర్:—ఓ! రజనీ! రా, రా!

ర:—ఏలుమంత్రమూ? నీలో నువ్వే జపించుకుంటూన్నావు?

ప్ర:—ఇది 'బ్రహ్మచర్య రహస్యం'. దీని సారాంశం, అంతర్గత జ్వరంలాగ లోలోపల జీర్ణించవలసిందేకాని పైకి పేలేది కాదు.

ర:—ఆఁ, ఫరవాలేదు, పైకి చదువుదూ!

ప్ర:—పెళ్లిసరదా ఉన్న నీ తలకి ఈ పవిత్రమైన బ్రహ్మచర్య సిద్ధాంతా లెక్కవు. ఎందుకు శ్రమ? అదీకాక, ఈరోజు నా బుర్ర మందంగా ఉందికూడా, మినపరొట్టె తినడం వల్లేమో!

ర:—ఓస్! డజను మినపరొట్టెలు తిననీ, నా మెదడుమాత్రం మందగించదు.

ప్ర:—ఉంటేకాదూ, మందగించడానికి?

ర:—పోనీ, నాకెందుకులే! ఆ బ్రహ్మచర్యరహస్యం నీదగ్గరే దాచుకో.

ప్ర:—ఇందులో రహస్యం ఏముంది? చదువుతా, విను. నే చదువుతూన్నంతసేపూ నీబుర్రలోకి ఏస్త్రీనీ రానీకుండా వినాలి. తెలుసా?

ర:—ఓ.

ప్ర:—చదవడానికి ముందు ఓ చిన్న ఉపోద్ఘాతం చెప్పాలి.

ర:—కొంపతీసి ఉపోద్ఘాతాన్ని కథకంటే పెంచవు కదా, 'బెర్నార్డ్ షా'లాగ?

ప్ర:—అబ్బ! విందూ!

ర:—ఊఁ.

ప్ర:—ఈ ప్రపంచకమంతా, పురుషుణ్ణి వల్లో వేసుకోవడంకోసం స్త్రీపన్నిన వ్యూహాలతోనిండుంది. గ్రహణశక్తిలోనూ సృష్టినైపుణ్యంలోనూ ప్రవీణుడైన పురుషుడు, కష్టపడి తననిండా మధువు నింపుకుంటాడు. ఆలోచనలోనూ, ఆకర్షణలోనూ, జిత్తులలోనూ ఆరితేరిన స్త్రీ, ఆ మకరందంకాస్తా పీల్చేసి, అతని జీవితాన్ని నిస్సారంచేస్తుంది. అందుచేత, ఆడవాళ్లందరికీ వోటే ఉంటే, అది బ్రహ్మచారులమీద పన్నన్నమాటే కాదూ?

ర:—నీదంతా తలక్రిందుసిద్ధాంతం. నిజంగా మకరందం ఉండేది స్త్రీలలోనే. దాన్ని పీల్చేసేవాళ్లం మనం.

ప్ర:—'మనం' అనకు. నువ్వు!

ర:—పోనీ, నువ్వు; కాకపోతే నేను; నేను కాకపోతే మరొకడు. పాపం, స్త్రీ త్యాగ స్వరూపిణి. తాను ప్రేమించినవాడి కోసం ఎంత త్యాగమైనా చేస్తుంది.

ప్ర:—వెర్రిగాడా! స్వార్థత్యాగం చేయగలిగింది, మరొకరిని మరీ తేలిగ్గా త్యాగం చేస్తుంది కాదోయ్?

ర:—అది నేనొప్పుకోను. స్త్రీ తన భర్తని పువ్వుల్లో పెట్టి పూజిస్తుంది.

ప్ర:—అవునవును. పూజించదూ మరి? 'వైలినిస్ట్' తన 'బౌ'ని కాపాడుకున్నట్లు, తన ఆనందం తీరడానికి మగవాణ్ణి ఒక 'బౌ'గా వాడుతుంది. 'బౌ'ని ఎవరికీ ఎరువివ్వరుకదా? 'బౌగా' మారితే మన వ్యక్తిత్వమూ, స్వాతంత్ర్యమూ స్త్రీహస్తంగతాలన్నమాట. వద్దు బాబూ. నాలాంటి బ్రహ్మచారి కా దుర్గతి వద్దు.

ర:—నన్నడిగావా...

ప్ర:—నిన్నేమీ అడగడంలేదు. మాట్లాడకుండా విని, తరవాత వాదించు.

ర:—సరే, కానీ!

ప్ర:—ఈ పవిత్ర గ్రంథంపేరు, 'బ్రహ్మచర్య రహస్యం'. "The Miracles of Brahmacharya" అనే ఉత్కృష్ట గ్రంథానికి నా అనువాదం. ఒక చిన్నఘట్టం, చదువుతా, విను.

"స్త్రీల ప్రేమొక సాలెపట్టు, దాన్ని తాకిన ఆటకట్టు.
పట్టుపడితే వట్టిరట్టు, వద్దుబాబూ! ఒట్టు!, ఒట్టు!"

ర:—(పకపక నవ్వుతూ) మంచి గ్రంథమే అనువాదించావు!

ప్ర:—(తీక్షణంగా) ఏయ్. రజనీ! విను.

"గగడు తేరిన మగువ, సాలె; తారసిల్లిన దానిపాలె;
ఆమె తెరచిన ప్రేమజోలె, బ్రహ్మచారికి బల్ దివాలే."

ర:—(కడుపుబ్బేలాగి నవ్వుతూంటాడు)

ప్ర:—(కోపంగా) ఏమిటా నవ్వు? ఇంక చదవను, పో!

ర:—(నవ్వు ఆపుకుంటూ) నీపెళ్లెప్పుడోయ్, బ్రహ్మచారీ?

ప్ర:—అనుకున్నా! నువ్వూ అడిగావూ! నా వివాహసమస్య, ప్రపంచసమస్యగా మారింది, మీఅందరినోటా పడి.

ర:—మధ్య నే నేం చేశానోయ్?

ప్ర:—పెళ్లాడాలనే ఆ 'ఇన్నర్ అర్జ్' నాకు లేదర్రా, బాబూ, అంటే, వినిపించుకోరేమిటోయ్?

ర:—మీవాళ్లు నీ యిష్టప్రకారమే చేస్తారు కాదూ?

ప్ర:—సరి సరి! నా మొహానికి అంత అదృష్టమా? "బి.యే. వెలిగించావు, ఇంక పెళ్లికూడా వెలిగించవోయ్, చవటమ్మా" అంటూన్నారు మావాళ్లు.

ర:—అవును మరి.

ప్ర:—ఏం అవును మరి? బి.యే.కి పెళ్లికీ ఉన్న సంబంధం ఏమిటోయ్? ఇలా చంపుకు తింటారని తెలిస్తే, ఆ చచ్చు బి.యే. చటుక్కున 'ఫైల్'ఆయే ఊరుకునేవాణ్ణే, మీ బాధ తప్పించుకోడానికి!

ర:—మరీ బాగుంది! మధ్య మాకేం? కందకలేని దురద బచ్చలికా?

ప్ర:—నువ్వేంటేసరా? నేనూ మానాన్నగారూ కలిసి, ఎక్కడి.

కైనా బయలుదేరడం భయం. బ్రహ్మచెముడు తోంగి ల్లాగి, ఎక్కడచూసినా మా బంధువులేకాదూ! ఎవరో ఒకరు ఎదురుపడుతూండడం, ఎంతో కొంపమునిగేపని ఉన్నట్లు, అంతదూరాన్నుంచీ చప్పట్లుకొట్టి, మమ్మల్ని ఆపుతూండడం, తీరాదగ్గరకొచ్చాక "అబ్బే! మరేంలేదు కాని, మీ అబ్బాయి పెద్దమని వయాడు, పట్టా పుచ్చు కున్నాడు. ఇంకా పెళ్ళీగిళ్ళీ చెయ్యవా? బెండకాయలా ముదరపెడతావా?"...అంటూ, ఊపిరాడనీయరు. ఓరి మీ దుంపతెగా! బెండకాయని కానర్రా, ముదరడానికి! —అంటే, వాళ్ళకు 'బోటనీ' తెలిసేడిస్తేకాదూ?

ర:—అవును మరి! వాళ్ళ గ్రూపు 'బోటనీ' కాదుగా? 'మ్యాట్రిమనీ'

ప్ర:—బాగా చెప్పావు. ఇంక మిత్రులు సరేసరి, "ఎప్పుడయ్యా మాకు బూరెముక్క?" అంటారు. వాళ్లు బూరెలు తినడంలో నాకేం 'ఇంటరెస్ట్' చెప్పు, రజనీ?

ర:—ఇదెక్కడి గోలోయ్?

ప్ర:—రజనీ! ఇలాచూడు. నాకు అమ్మాయిలంటే, ముఖ్యంగా ఈకాలపు అమ్మాయిలంటే, పుట్టుకతోనే భయం అని, మావాళ్ళకీ, నీకూ, మన క్లాస్‌మేట్స్‌కీకూడా తెలుసును కదా?

ర:—ఆహా!

ప్ర:—పెళ్లిచేసుకోవడం అంటే కాస్త 'రిట్రీట్' అవుతానని తెలుసుకదా?

ర:—తెలుసునయ్యా, బాబూ!

ప్ర:—తెలిసిమట్టు కేం లాభం ంటా! మావాళ్ళతోపాటు నువ్వూ నా పెళ్ళిగొడవ సహస్రనామావళిగా జపించి తరిస్తూన్నావే!

ర:—ఎందుకీ నిష్ఠురం? బుర్రపోయినా పెళ్ళాడను—అని మీవాళ్ళతో సిసలుగా చెప్పేసేసెయ్.

ప్ర—నామాట వినిపించుకుంటే కాదూ వాళ్లు? చీటికీమాటికీ రకరకాల 'మాచెస్' తీసికొొచ్చి నానెత్తిమీదరుద్దేస్తుంటే ఏంచెయ్యను? అసలే, నీరసపు గుండెవాణ్ణి! ఎలాగోయ్ తట్టుకోవడం రజనీ?

ర:—అఁ! నచ్చిన అమ్మాయిని చటుక్కున పెళ్ళిచేసుకుని ఊరుకోకూడదూ?

ప్ర:—మంచిమాటే! ఇది, గుటుక్కున మందు మింగడంటోయ్! వాళ్ళకా అర్హతుందో లేదో చూడాలా?

ర:—ఏమిటా అర్హత? ఏ రంభనో, ఊర్వశినో నీకోసం సృష్టించాలా?

ప్ర:—అర్హతా, అందమూ అనేవి అనుభవించాలి కాని, వర్ణించేవి కావు. ఎవరికి తోచినట్లు వాళ్లు ఊహిస్తారు. నీకు అందమైంది నాకు రోతికావచ్చును. దేనికీ అందం అనేది స్వతహాగా ఉండదు. దానిని చూడడంవల్ల, మనలో కలిగిన రియాక్షనే అది!

ర:—చెప్పేదేదో తేలికమాటల్లో చెపుదూ! బాబూ!

ప్ర:—అంటే, అందం అనేది మనం ఆపాదించే గుణం అన్న మాట. ఏదైనా స్వతహాగా అందమైందే అయితే, అందరి దృష్టికీ ఒకలాగే తోచాలిగా? అలాకాదుకనకే, అందం, అర్ధ్వాతావిషయాల్లో అంతా ఏకీభవించరు.

ర:—పోనీ, నీ షరతులేవో చెప్పు. అవన్నీ కుదిరితేనే, మీ వాళ్ళను ఆ సంబంధం కుదుర్చుకొమ్మను. సరా?

ప్ర:—ఇదేం లెక్కల పేపరా, నూటికినూరు మార్కులూ రావా లనడానికి?

ర:—మరింకేం? ఇంకా అర్ధ్వాతా గిర్ధ్వాతా అంటావెందుకూ? 'సెలక్షన్'మీవాళ్ళకవిడిచిపెట్టి, మాట్లాడకుండాఒప్పుకో

ప్ర:—వరుడులేకుండా కత్తికి పెళ్లిచెయ్యమనే రకం నువ్వు.

ర:—అయితే నచ్చిన పిల్లని నువ్వే వెతుక్కో.

ప్ర:—మావాళ్ళూ ఇదేగోల. ఆపెళ్లికూతుళ్ళని నన్నే స్వయంగా చూసి మాట్లాడుకోమంటారు. పూర్వపురకం అమ్మాయి లైతే తలవంచుకుని ఉండేవారు కనక, అంత ప్రమాదం లేకుండా తప్పేదేమో మరి. కాని, ఈకాలపు ఎత్తు జోళ్ళ, పొడుగులోలకుల, 'రూజ్'బుగ్గల, 'లిప్‌స్టిక్' పెద వుల, 'నైలాన్'చీరల నవీనాంగనలున్నారే, అబ్బ! (కళ్లు మూసుకుని వణుకుతూ) నాకు సంబంధాలుగా వచ్చారు. (నిట్టూర్చి) Thank God! ఇంకా బంధాలుగా మాత్రం రాలేదు!

ర:—(నవ్వుతూ) పోనీ, అంత భయమైతే వాళ్ళని చూడకు.

ప్ర:—ఉండు, విను. పేరిగాణ్ణి పేనినట్లు. ప్రక్కనుంచి చూపుల తోనూ తూపులతోనూ నూనాన్నగారు నన్ను హెచ్చ రిస్తూంటే, స్థానంవారి శకుంతలలాగ, ఓరచూపు కన్నులతో, నిట్టూర్పుగాడ్పులతో ఆ అమ్మాయిగారునా వైపు సిగ్గుగానో, నిగ్గుగానో టక్కుమని చూసేసి...

ర:—చూసేసి పెళ్లాడేస్తావా?

ప్ర:—కాదు బాబూ, విను, చూసేసి నాకు నచ్చలేదని నూనా నాన్నగారితో చెప్పి, దాటేద్దామనుకుంటే,

ర:—ఏం? ఆ ఎత్తు పారలేదా?

ప్ర,—లేదు, ఏదో 'గ్రాడ్యుయేట్'ని కనక, 'గ్రాడ్యుయల్'గా రెప్పలు విప్పి చూడబోతే, వాళ్లు 'మోడర్న్ గరల్స్' కాదూ, నాకన్న ముందుగానే, ఓరగా, కోరగా, సూటిగా నాకళ్ళల్లోకి చూసెయ్యడంచేత...

ర:—వాళ్ళకి వశం అయిపోయావా?

ప్ర:—లేదు, అలా చూసెయ్యడంచేత నా బలవద్వికసితనయ నాలు హాశాన్ముకుళా లైపోయాయి.

ర:—(వెటకారంగా) అరెరెరెరే! ఎంత అలసిపోయావోయ్? ఎంత స్ట్రెయినోయ్ నీ కళ్ళకి?

ప్ర:—నీకేం! ఆక్షేపిస్తావు! నీవైపుకూడా ఏ అమ్మాయిలైనా అలా చూస్తే తెలుస్తుంది, ఏంచేస్తావో!

ర:—ఏం చేస్తాను? చూశడం, ఆకషం ఒకసారే మనకేస్‌లో! ఊఁ...ఇంక చాలా పొద్దుపోయింది. వెళ్లొస్తా మరి. (వెడుతూంటాడు)

ప్ర:—రజనీ! ఆగు, ఆగు! ఒక్క నిమిషం. ఇందాకటి నా అనువా
దానికి 'ఒరిజినల్'కూడా వినిపిస్తా, ఏది బాగుందో చెప్పు.

ర:—దీనికికూడా మళ్లీ ఓ ఉపోద్ఘాతం దంచవు కదా?

ప్ర:—(వెటకారంగా) పెళ్లాడేవారి వర్తక సంఘానికి అధ్యక్షు
డుగా ఉండవలసినవాడవు! నీకవన్నీ నచ్చుతాయా?

ర:—(నవ్వుతూ) ప్రళయం వచ్చినా పెళ్లి మానను, అయినా,
తీరా నీబోధన విన్నాక, మారతానేమో! కానీ!

ప్ర:—Women's love is a spider's web:
If you fall into it, aye! there's the rub:
When once caught, Hell is your lot!
Beware, bachelor! Away from the web!

When once the web the fly touches,
Coil after coil. the spider flings;
Enticed, enmeshed, the fly in clutches
Seeks blessings in spider's kissings!
Beware, bachelor! Away from the web!

(చదువుకుంటూండగా, ప్రభ తండ్రీ, చెల్లెలూ వచ్చి, వింటూంటారు)
ఏది బాగుంది రజనీ!

ర:—నీదే. చాలా ఫీలయి వ్రాశావు మరి! స్త్రీ ప్రేమతోనూ,
సాలె పట్టుతోనూ ఇదివరకే కాస్త పరిచయం ఉన్న
వాడిలా!

ప్ర:—షటప్!

తండ్రి:—(ముందుకు వచ్చి) నువ్వు ముయ్యరా నోరు! వెధవ
వ్రాతలు! వెధవ వ్రాతలూ అని! ఇదేనా నీ ఎం.యే.
చదువు?

(ప్రభాకర్ కంగారుపడి పుస్తకం జారవిడుస్తాడు)

ర:—కాదండీ, మావయ్యగారూ! నాకు ఉపదేశం చేస్తున్నాడు.

తండ్రి:—చప్పున పెళ్లిచేసెయ్యకపోతే; ఇలాంటి పిచ్చిపుస్తకాలే నీకు గతి. మన కాలేజీలో అంతమంది అమ్మాయిలున్నారు కదా. బుద్ధిమంతురాలినీ, అందమైనదాన్నీ, నువ్వే ఏరుకుంటే ఆ సంబంధం మాట్లాడవచ్చే!

చెల్లెలు:—అన్నయ్యా! నాకోదిచేస్తే నే నేరిపెడతా, లక్ష సంబంధాలు; రా!

ప్ర:—నీ మొహం!

ర:—అవునోయ్! ఎందుకాలస్యం, మీ నాన్నగారు అంతలా అంటూన్నప్పుడు?

తండ్రి:—అలా పెట్టు, ఓతట్టవరస చీవాట్లు! పోనీ మాట్లాడక ఊరుకుందామంటే, ఇంట్లో ఒకటే పోరు.

ర:—(వేళాకోళంగా) అమ్మమ్మా! పెద్దలమాట కాదనడండీ, ప్రభ!

ప్ర:—(కోపంగా) అందుకు నీ సిఫార్సు కావాలా?

చెల్లెలు:—(రజనితో) ఏం కావాలో కాని, ఈమధ్య అన్నయ్య దృష్టి బెంగాలీ అమ్మాయిలమీదికి, దక్షిణాది అమ్మాయిలమీదికీ ప్రసరిస్తూన్నట్లుందే!

ప్ర:—నీ మొహం.

ర:—ఇంకా నయం; సంతోషించు; గిరీశానికిలాగ 'యంగ్ విడోస్' మీదికి ప్రసరించడంలేదు.

తండ్రి!—ఎటో అటు ప్రసరించనిద్దురూ, అంతే చాలూ!

ప్ర:—ప్రతీ అమ్మాయివైపూ చూస్తూండడమే నాపనా? నే చదువుకుంటూన్నప్పుడైనా చూడలేదు, వాళ్ళవైపు. వాళ్ళంటే అసహ్యం.

చెల్లెలు:—ఆc, అసహ్యం కాదులే, భయం!

ప్ర:—ఏడిశావులే!

చెల్లెలు:—(వెక్కిరిస్తూ) నువ్వే ఏడిశావులే!

తండ్రి:—(గట్టిగా) ఊరుకోండర్రా! (ప్రభవైపు సీరియస్ గా చూస్తూ) ఒరేయ్! ఈయేడు నీకు పెళ్ళయే తీరాలి. చదువూ చదవక, పనీ చెయ్యక, పెళ్లీ ఆడక, అశ్వత్థామలాగ, హనుమంతుడిలాగా ఉంటావా, బ్రహ్మచర్యంమీద పుస్తకాలు పఠిస్తూ? అంతా ఏమనుకుంటున్నారో తెలుసా? (నెమ్మదిగా) నీకు అమ్మాయిల్నిచూస్తే, భయం అనుకుంటూన్నారురా.

చెల్లెలు:—అనుకోవడమేమిటి? నిజమే నాన్నగారూ!

ప్ర:—అవును నిజమే! అలాంటప్పుడు ఎందుకుబాధిస్తారు నన్ను? నాకు పెళ్లాడాలనే కోరిక, ఆవేదనా ఉంటే...

తండ్రి:—కోరికా! ఆవేదనా! నీమొహం! నాలుగైదు సంబంధాలు చూసేడిస్తేకాదూ, కోరికలూ, ఆవేదనలూ, కవిత్వాలూ పుట్టుకు రావడానికి.

ప్ర:—ఏమో, మీరేమనుకున్నా సరే! నేనింకా ఎం.ఏ. చదువుకోవాలి.

చెల్లెలు:—ఇంకా చదువేమిటి? తత్ క్షణం పెళ్లిచేసెయ్యక!

ప్ర:—మహాబాగా సెలవిచ్చావులే! నువ్విలా పెళ్లీ గిళ్లీ లేకుండా డిగ్రీలు సంపాదిస్తూండు! నాకు మాత్రం ఓ రాక్షసిని కట్టబెట్టి పెద్దపెళ్లి చేయించెయ్.

ర:—ఆ గొడవ మాకొదిలేస్తే...

చెల్లెలు;—చిటికల్లో చేయించేస్తాం!

ప్ర:—(ఆతాళంలోనే వెక్కిరిస్తాడు)

తండ్రి:—(దగ్గరగా వచ్చి) ఇంట్లో కలకల్లాడుతూ కోడలుంటే...

ప్ర:—నాన్నగారూ! చెల్లెలి అలంకారాలకే చాలడం లేదుకదా, మన సంపాదన! 'కాంపౌండ్ ఇంటరెస్ట్'లాగ, మరో ఆడదయ్యంకూడా ఉంటే చెప్పాలా ర క్తి!

తండ్రి:—మెట్ట వేదాంతాలు! అసలు సంగతి చెప్పవు. ఆడపిల్లలంటే ఏదో దిక్కుమాలిన పిరికితనమూ భయమూ అని! ఇంక నేనూరుకోను, నీకు పెళ్లి చేసే తీరతాను. రేపే బయలుదేరి ఒక సంబంధంచూడడానికి మనమంతా మద్రాసు వెడుతూన్నాం, ఏఁ? తెలిసిందా? (రజనితో) రజనీ! నువ్వూ మాతోరావాలి. వాడిభారం సగం నీది.

చెల్లెలు:—సగం నాదీను. (ఒక ఫోటో ప్రభముందు పడేసి, తండ్రీ, చెల్లెలూ, దీనంగా చూస్తూన్న ప్రభవైపు చూస్తూ, నవ్వుతూ వెళ్లిపోతారు.)

ప్ర:—(దీనంగా) రజనీ! పుట్టిల్లూ, ఆ సౌఖ్యమూ నాకు ఇంతటితో ఆఖరా? అత్తారింటికి పోవలసిందేనా?

ర:—నీబాధచూస్తే, నాకూ పెళ్ళంటే విరక్తి పుట్టేటట్టుంది. ఇంతకీ, అత్తారింటికెళ్లేది నువ్వు కాదుగా?

ప్ర:—(మరింత దీనంగా) ఎందుకో అలా అనిపిస్తూందోయ్! నా ఆలోచనలు పుట్టింటికీ, అత్తింటికీ మధ్య, రకరకాల అవతారాలెత్తుతూంటే, దుఃఖం తెరలు తెరలుగా, అలలు అలలుగా, ఉబికుబికి వస్తూంటే... (డగ్గుత్తికతో) చెల్లెలు ఏడుస్తుందేమో అని... చూసి నవ్వుతుందేమో అని___

(కన్నీళ్లు అదుపుపెట్టుకొని సైలెంటుగా దుఃఖిస్తాడు)

ర:—([illegible]) అబ్బెబ్బె! ఏమీ బాగా లేదోయ్, నీ ఫోటోగ్రఫీ.

ప్ర:—(కొంచెం తేరుకొని) ఈదుఃఖాన్ని రసగుల్లాలో పాకంలాగ పైకి చిమ్మకుండా ఎంతసేపు నిలపగలనోయ్, రజనీ!

ర:—(నవ్వుతూ) ఏమైనా తరవాయుంటే, తరవాత సావకాశంగా ఏడవవచ్చులే! ముందు ఈ ఫోటో ఒక్కసారి చూడు. ఒక్కసారి.

(ప్రభ "ఊఁహుఁ" అని విదళించుకుంటాడు.)

ర:—ప్రాణంలేని ఫోటో, చూడడానికేఁ? (ప్రభ మళ్లీ "ఊఁహుఁ" అంటాడు) ఒక్కసారి చూడవోయ్! అరిగిపోవులే! నీ మామూలు ప్రోసెస్‌లోనే! నాటకంలో శకుంతల్లాగే! కానీ.

ప్ర:—(రెండు మూడుసార్లు విదళించుకుని, చివరికి రెప్పలెత్తి చూసి కంగారుతో) 'పద్మిని'! పద్మిని అని ఉందేమిటోయ్! ఈఫోటో పైని?

ర—ఉఁ ఉంటేనే? నీ పేరుతో బాగా అన్వయిస్తుందిగా? ప్రభాకర కాంతుల్లోకాని, పద్మిని వికసించదోయ్!

ప్ర:—(కన్నుమూయక, ఆశ్చర్యంతో) ఆహాఁహాఁ! అందుకు కాదు. గులాబీ రేకుల్లాంటి నా రెప్పలు వాల్చాలనుకుంటే వాల వేమిటి? ఇదేమిటి! ఏదో...ఒక వర్ణనాతీతమైన ఝల్లు అలా పరుగెత్తుతూందే, నాలో?

ర:...ఏమిటోయ్, కవిత్వం? ఇదంతా నీ బ్రహ్మచర్యరహస్య మేనా, ఏమిటి?

ప్ర:—కాదోయ్! ఇదేదో మాయ! ఇదివరకల్లా అమ్మాయిల కళ్ళనిచూ స్తే శయనించే నా కళ్లు, అదేమిటో కాని, ఈ సారి ఈఫోటో కళ్ళల్లోకి పయనిస్తూన్నాయేమిటి! (గగుర్పాటుతో) ఇదేం జబ్బు కాదుగదా, రజనీ?

ర:— (వెటకారపు కంగారుతో) జబ్బే బాబూ, ఒకరకం జబ్బే! మీవాళ్ళని పిలవనా?

ప్ర:—వద్దు, వద్దు!

ర:—ఏమండోయ్, ఏమండోయ్! మీవాడికేదో పూనింది, త్వరగా రండి! (వస్తూన్నాం, వస్తూన్నాం అని లోపలనుంచి జవాబు)

ప్ర:—ఆఁఆఁ! ఆగు, ఆగు! (చప్పున దీపం ఆర్పి బోర్లా పడుకుంటాడు)

ర:—(నవ్వుతూ) ఇంక నేనూ వెళ్లి పడకేస్తాలే, తెల్లారితే ప్రయాణంకాదూ!

ప్ర:—(పడుకునే) పోదూ! మంచి పనే చేశావు! నిన్ను నమ్మితే ఇంతే!

ర:—(వెడుతూ) అవునవును! నన్నెందుకు నమ్మతావు? పద్, పద్మ!

ప్ర:—పోదూ, బాబూ!

(లోపలినుంచి చెల్లెలు)

"ఆరిపేయవే దీపము; వెలుగులో నీమీద
నిలపలేనే మనసు; ఆరిపేయవే దీపము!"

(అని పాడుతూంటే, ప్రభ బోర్లా పడుకుని, తలగడాల మధ్య తలదాచుకుంటాడు.)

# రెండో రంగం



(ట్రిప్లికేన్ బీచ్‌ని, ప్రభా, రజనీ)

ర:—లాసాంజలీస్‌బీచ్ తరవాత, ప్రపంచకంలోకెల్లా ఈ మెరీనా బీచే అందమైందంటారు కాదూ?

ప్ర:—సందేహమేమిటి? సహజసౌందర్యానికి మెరుగుగా వెన్నెల ప్రసరిస్తూంటే, ఈ దృశ్యాలు ఎంత వికసిస్తూన్నాయో, చూడు.

ర:—ప్రస్తుతం వికసిస్తూన్నది ఈదృశ్యాలు కాదు, నీ మనస్సు.

ప్ర:—ఏదో! మనకనుకూలమై ప్రాతపడిన దృశ్యాలు కొన్ని. విరుద్ధమై ఆశ్చర్యం కలిగించే క్రొత్త దృశ్యాలు కొన్నీ చూస్తూంటే, మనస్సు పరకాయ ప్రవేశం చేస్తూంది.

ర:—పద్మిని ఫోటో చూసినప్పటినుంచీనా?

ప్ర:—'నాన్సెన్స్!' లేనిపోని అర్థాలు తీయకు.

ర:—సరేలే! నాకెందుకు!

ప్ర:—మనుష్య ప్రకృతులు ఎన్ని రకాలున్నాయో అన్నీ ఈ బీచ్‌ని కనిపిస్తూన్నాయి. అలా చూడు. ఏవో భావాలు మేఘాలంటి పరుగెత్తుతూంటే, రేడియోగోలా, యేగోలా వినిపించుకోక, ఆకాశాన్ని ఖాళీగా పరికిస్తూ, సిగరెట్స్ కాలుస్తూ సృజించిన ధూమ చక్రాల్ని తమ భావాలతోపాటు గర్భిణీ మేఘాలుగా ఎలా విడిచిపెడుతూన్నారో, వాళ్లు!

ర:—పాపం! చాలా ఫీలయి చెపుతూన్నావు, ఈ భావాన్ని పద్యంలో చెప్పలేకపోయావా?

ప్ర:—అవునవును. ఇదొకటి నీకర్థమైందని!

ర:—అట్టే ఉడుక్కోక, అలా చూడు. "లోకముతో మన కేటికె? లోలాక్షీ! రా, పోదము!" అన్న ధోరణిలో, ప్రేమంటే ఆబగా ఉన్న, వేడివేడి, క్రొత్త జంటలు, ఎందరు చూస్తూన్నా, ఎలా షికారు చేస్తూన్నారో, సిగ్గు విడిచి!

ప్ర:—అబ్బ! బ్రహ్మచారులంకదా, అసలు మనం ఆ 'కపుల్స్' కేసి చూడడం ఎందుకూ అంట!

ర:—ఓసోస్! పెళ్ళయితే, నీకు వాళ్ళకన్నా ఒళ్ళు తెలియదులే!

ప్ర:—పోనీవోయ్! నీతో రావడం నాకెందుకే భయం.

ర:—వ్రతభంగం చెయ్యనయ్యా, భీష్ముడా! చూసినంతమా త్రాన్నే చెడిపోతావా? రక్షరేకు కట్టిస్తానులే!

ప్ర:—నా పాలిటికి నువ్వే ఓ పెద్ద రక్షరేకూ, దిష్టిబొమ్మా కూడాను!

ర:—నీతో వాదం ఏమిటి? ఇలారా! కాస్త రేడియోఅయినా విందాం!

ప్ర:—అలా అను, బాగుంది.

(ఇద్దరూ కూర్చుంటారు, రేడియోలో ఈ క్రింది జావళీ వినుపిస్తూంటుంది)

"మరులు కొన్నదిరా, మానినీమణి నీపై ॥మరులు॥
పరిపరివిధముల పరితపించుచున్నది ॥మరులు॥
ధరలో తనకు నీవే తగిన వల్లభుడని" ॥మరులు॥

ప్ర:—(త్రుళ్లిపడి లేచి, బాధగా) అబ్బా! పోదాం, పద, రజనీ!

ర:—అదేమిటి! అప్పుడే?

ప్ర:—పోనిద్దూ, దిక్కుమాలిన పాట!

ర:—ఏం?

ప్ర:—ఏం, ఏమిటి? బ్రహ్మచారులం! వెధవ జావళీ వింటామా?

ర:—హంసానందిరాగం, బాగాలేదా!

ప్ర:—రాగానికేం? భావం మాట చెపుతూన్నా. పాటంతా మోటే!

ర:—మోటుతనం ఎక్కడుంది? మోహంతో ఉన్న ఒక స్త్రీ స్థితి. నీలాంటి కవే వర్ణించాడు. అంతే కాదూ?

ప్ర:—ఏమో! ఇది నాలాంటి బ్రహ్మచారులు వినే పాటకాదు.

ర:—పాపం, పాట వింటే పద్మిని జ్ఞాపకం వస్తూందా?

ప్ర:—(చెవులు మూసుకుని) బాబోయ్! నీ మాటలు వినదలచుకోలేదు.

ర:—సరేలే, ఆ 'మెరీనా కాంటీన్' వైపు నడు.

ప్ర:—వెడదాం కాని, ఒక్కసారి ఆ 'బై పాత్స్'లోకి చూడు. ఆ దారిని మెరపుల్లాగా, హరిణాల్లాగా పరుగెత్తుతూన్న హరిణేక్షణలవైపు, వాళ్ళనుంచి యేవిధమైన 'సింపతెటిక్ వైబ్రేషన్'లూ లేకపోయినా, ఎలా చూస్తూన్నారో, వాళ్లు! పాపం, చెడచూడడంవల్ల కలిగిన ఆ 'మష్రూమ్' ఆనందాన్ని స్వయంపాకం చేసుకుంటూ, ఎలా పొంచి ఉన్నారో, ఆ మహోద్యోగులు, సిగ్గులేక!

ర:—నీదెలాగైనా, మునపటి ధోరణి కాదోయ్!

ప్ర:—ఏమన్నానోయ్, బాబూ?

ర:—ఇప్పుడే కదా నన్నాక్షేపించావు? నీకుమాత్రం ఆ 'లవర్స్' గొడవ ఎందుకు చెప్పు! నువ్వూ ఒక 'లవర్'గా మారాలనా?

ప్ర:—ఒట్టు! నీ తోడు. నాకలాంటి దుర్బుద్ధి లేదు.

ర:—(వేళాకోళంగా) ఊఁ?

ప్ర,—అనుకో, అనుకో! ఆ పాపం నీదే!

ర:—(నవ్వుతాడు)

ప్ర:—తెగ నవ్వావంటే 'బటన్స్' ఊడిపోతాయి, జాగ్రత్త! ఇదిగో! (కుదిపి) ఈ ప్రకృతిశోభ చూసి, ఆనందించు.

ర:—బాబోయ్! మళ్లీ వర్ణనా?

ప్ర:—(వినుపించుకోక) ఈరోజు పూర్ణిమ కావడం, సముద్రగర్భంలోనుంచి, లజ్జావతియైన చంద్రవదన మేలిముసుగొత్తిగించుకొన్నట్లు, ఆ చంద్ర బింబం నెమ్మదిగా పైకి రావడం. . .

ర:—పద్మినిలాగా?

ప్ర:—(వినుపించుకోక) తియ్యని పండు వెన్నెలలు పైని పడుతూ ఉంటే, డిశంబరు చలిగాలులు సోకుతూంటే, అవన్నీ, ఈ దృశ్యాలతో కలిసి, నా అనుభవంలోలేని, నాకే అర్థంకాని, ఒక కొత్త [illegible].

ర:—పాత 'సెన్సేష'నే కొత్తవన్నె[illegible].

ప్ర:—ఏమో కాని, చాలా [illegible]యంగా ఉంది. ,,

ర:—పాపం, భయమూ నాయనా? బ్రహ్మచారిగా ఉన్నప్పుడే నీ ధోరణి ఇంతిలా ఉంటే...

ప్ర:—పోనీలేవోయ్! స్నేహితుడవు కదా అని, నీ యెదట ప్రకృతి సౌందర్యం వర్ణిస్తూంటే, అపార్థాలు తీసి, నా నెత్తిని రుద్దుతావా? నాకు పిచ్చెత్తించకు.

ర:—ఇంకా వేరే యెత్తాలా? ఇంతవరకూ, ఓ! కవిత్వం వెలిగింగించావు. తరవాత, పద్మినిని చూడడం. ఆ తరవాత, 'థర్డ్ స్టేజ్' పిచ్చే! (ప్రభ కళ్లల్లో నీళ్లు తిరుగుతాయి. ముఖం అటు త్రిప్పేసి, మాటాడలేకపోతాడు) అరే! క్షమించాలి. చనువుకొద్దీ వేళాకోళం చేస్తే, ఇదా? పద! ఆహోటల్లో కెళ్లి, ఓ 'కూల్ డ్రింక్' త్రాగుతే, నీ 'స్పిరిట్స్' కాస్త 'కూల్ డౌన్' అవుతాయి. (ప్రభ భుజంమీద చెయ్యేసి, మెల్లగా నడిపించుకు తీసుకువెడుతూంటే, దూరాన్ని రేడియోలో నుంచి, "కొమ్మరో వానికింత బిగువేలనే!" అన్న జావళీ ప్రారంభమవుతుంది.)

ప్ర:—(గట్టిగా చెవులు మూసుకుని) మళ్లీనా? వెధవ జావళీ! వెధవ జావళీ! (అంటూ తొందరగా వెళ్ళి పోతాడు)

# మూడో రంగం

(మెరీనా కాంటీన్‌లో ప్రభా, రజనీ)

ప్ర:—ఏ 'టేబిల్' చూసినా, 'టు ది బ్రిమ్'! ఈ 'లేడీస్ అండ్ దుఫ్ఫీస్', స్థిమితంగా మేస్తూ, నాకళ్ళ కొక సాంఘికపు 'కూటు'గా కనుపిస్తున్నారు.

ర:—ఆదివారం కనక, ప్రెసిడెన్సీ కాలేజ్ అబ్బాయిలూ, క్వీన్ మేరీస్ అమ్మాయిలూ, తండోపతండాలుగా వస్తున్నట్లున్నారు. కొంతసేపు నిలబడదాం; పనేముంది?

ప్ర:—'బోయ్', 'బోయ్! (ఎవరూ పలకరు; మళ్లీ గట్టిగా) 'బోయ్' (ఎవరూ పలకరు) సిసింద్రీల్లాగ వట్టి అడవి గోలే కాని, ఏ సెర్వరూ పలకడేమిటోయ్? వీళ్ళని చెడపిలిచే టప్పటికి నా గొంతుక్కి గానసభ చేసినంత పనౌతూంది.

(ఇంతలో సెర్వర్ వస్తాడు.)

సెర్వర్:—ఎన్న సార్? ఈదినం సన్‌డే, అందుకుదా రొంబ రష్!

ప్ర:—అయితే, పోనా?

సె:—ఇంగె ఎడం ఇల్లే, సార్! అంద లేడీస్ రూమ్ ఖాళీగా ఇరుకు. పోయి ఉక్కారుంగో.

ర:—ఎక్కడా చోటులేకపోతే, ఏం చేస్తాం? లేడీస్ రూమే గతి!

ప్ర:—సరే, రా మరి.

ర:—నే రాను. నువ్వు వెళ్లి రా. ఆ యిసుకలో చతికిలబడి, బీచ్ దృశ్యాలే చూస్తూ కూర్చుంటాను.

ప్ర:—పోనీ, నేనూ వచ్చేస్తాలెద్దూ! తీరా కూర్చున్నాక, లేడీస్ వచ్చారంటే, ప్రమాదం!

ర:—ఆఁ, ఏదో చప్పున కానిచ్చి వచ్చేద్దూ!

సె:—ఇంతలో యేరూ వరమూటే, సార్! నాదిదా పూచీ.

ప్ర:—సరే, ఇతగాడు పూచీ పడుతూన్నాడు గనక, వెళ్లిరా. (రజని వెడుతూంటాడు) ఇదిగో, రజనీ! ఎక్కడికీ దాటె య్యకు సుమీ, ఒక్కణ్ణే అయిపోతాను.

ర:—(లోపలినుంచి) అమ్మమ్మా! ఎంతమాట.

(లేడీస్ రూమ్‌లో ఒకే టేబిల్, రెండు కుర్చీలూ ఉన్నాయి, ఒక దానిలో ప్రభ కూర్చుంటాడు.)

సె:—'వాట్ డు యు వాంట్ సార్? కారాపూరీ, కాషూనట్, బోంబే సోమాస్, బకాళాబాత్, బాదంఖీర్, రసగుల్లా, మేంగోలా...

ప్ర:—ఆగవోయ్, బాబూ, ఆగు! నాకు అవేవీ వద్దు. (కొంచెం సేపు ఆలోచించి) ఆఁ! ఓ పనిచెయ్యి. యతి కుదిరింది కనక, బకాళాబాత్ అండ్ బాదంఖీర్ పట్టుకురా.

సె:—సరిదా, సార్! (వెడతాడు)

(హోటల్ రేడియోలోనుంచి "మరుబారి కోర్వలేనురా!" అన్న జావళీ వినిపిస్తుంది. ప్రభ త్రుళ్ళిపడి, చెవులు మూసుకుని, "బోయ్! బోయ్!" అని కేకలేస్తూంటే, సెర్వర్ టిఫిన్‌తో వస్తాడు.)

సె:—అడడడడా! ఎన్న ఇది సార్? సండమాదిరి అరుస్తారే! టిఫిన్ తెచ్చి అయిందే!

ప్ర:—(చెవులు మూసుకునే) ఎహె! టిఫిన్‌కోసం కాదయ్యా! ముందా రేడియో ఆపెయ్! వెధవ జావళీ!

సె:—జావళీ అంటే భయమా సార్?

ప్ర:—నాకు భయమేమిటి? అసహ్యం!

సె:—ప్రొప్రయిటర్ రేడియో ఇప్పు స్టాప్ మాతే, సార్! టిఫిన్‌చేసి, పోండిమీ-

ప్ర:—అయితే, చెవుల్లో గుడ్డలు కుక్కుకుని, టిఫిన్ తిని, పోతాతే. (అలా చేస్తాడు)

సె:—(నవ్వుతూ) అంతా నవ్వుతురు సార్! అలా చెయ్యకండిమీ!

ప్ర:—నవ్వుతే, నవ్వనీ!

(ప్రభ బకాళాబాత్ తింటూంటే, ఇద్దరు కాలేజ్ గరల్స్ టకటక చకచక వస్తారు. ప్రభ ఉలికిపడి నిలబడతాడు. మాట లేకుండా, అతనూ, వాళ్లూకూడా తెల్లబోతారు.)

సె:— (నవ్వుతూ) అడడడడా! ఎన్న గమ్మత్! పోలీసువాళ్ళూ, దొంగలూ మీట్ చేసిన మాదిరి, రెండు పార్టీలూ తెల్లపోతురే!

పద్మిని:— (చురుకుగా చూసి) "What is this nuisance?"

ప్ర:—(వణుకుతూ, తనలో, నెమ్మదిగా) 'న్యూసెన్స్!' ఏం చేశాను చెప్మా!

ప:—(గట్టిగా) "Yes, It is a new sense!"

(ప్రభ తుళ్లి పడతాడు, సెర్వర్ నవ్వుతాడు)

తార:—(నవ్వుతూ) పాపం! తెలియక 'లేడీస్‌రూమ్' లోకి వచ్చేశాడే! క్షమించవే!

ప:—తెలియకపోవడం ఏమిటి? చంటిపిల్లాడా! ఒకసారి క్షమిస్తే ఎప్పుడూ ఇలాగే చేస్తూంటాడు.

ప్ర:—(భయపడుతూ, సెగ్వార్‌తో నెమ్మదిగా) ఎవరే కాడీలు! ఏదో క్షమించడం, గిమించడం అంటూన్నారు! లేకపోతే శిక్షిస్తారా?

సె:—అయ్యో, రామ! భయమిల్లే, సార్! వాళ్లు ఫా ర్వస్ మేరీస్ గరల్స్. ఇలా బెదురుతేదా, ఇంకా బెదిరిస్తురు.

ప:—(కోపంగా) తారా! మాట్లాడడే, ఆయనగారూ? మూగా, చెవ్వుడా?

తా:—(జాలిగా నవ్వుతూ) పాపం! అలా కోపంగా చూడకే, పద్మినీ!

ప్ర:—(త్రుళ్లిపడి తనలో) పద్మినా! పద్మి నంటూందేమిటి చెప్మా, ఈ వెకిలి పిల్ల? నాకు పట్టాలనుకుంటూన్న దయ్యాం కాదు కదా, కొంపతీసి?

తా:—అలా చూడకే! పాపం, వెర్రిమొగం వేశాడే! కంగారై పోతున్నాడే!

ప:—(వేళాకోళంగా) ఆ! కంగారు! అంత కంగారైతే సరిగ్గా ఈ గదిలోకే యెందుకొచ్చాడో? ఏ అమ్మాయి కోసమో అయి ఉండాలన్నమాట!

తా:—(జాలిగా నవ్వుతూ) రామ, రామ! అంత ధైర్యశాలి కాడే, పాపం! (సెద్వార్ నవ్వుతాడు)

ప్ర:—(చెమటలద్దుకుంటూ, సెగ్వార్‌తో) రామ, రామ! ఇదేమిటోయ్, బోయ్! నన్నవతలికి దిగబెట్టెయ్. నీ కేదైనాఇచ్చుకుంటా!

(సెగ్వార్ జవాబు చెప్పక, తెగ నవ్వుతూంటాడు; ఈలోగా ప్రభ తెప్పరించు కున్న బాదంఖీర్ పద్మిని తాగేస్తూంటుంది)

ప్ర:—(లేని ధైర్యం తెచ్చుకుని, రెండు గుటకలు మింగి) ఇదేమిటండీ? నా బాదంఖీర్ మీరు పీల్చేస్తారు?

తా:— (కడుపు చెక్కలయేటట్లు నవ్వుతూ) My dear friend! She drinks to your health!

ప్ర:— (విసుగుతో) గమ్మత్తుగా ఉందే వాటం! ఈవూళ్లో కాలేజ్ గరల్స్‌కి, ఇలా పైవాళ్ళ డ్రింక్స్ పీల్చేస్తూండడం మామూలా?

తా:— (విరగబడి నవ్వుతూ) ఊఁ!

ప్ర:— (సెర్వర్‌తో) ఇలాంటి దోపిళ్లు జరుగుతూంటే, మాలాంటి బ్రహ్మచారులు నిభాయించడం ఎలాగ? (సెర్వర్ నవ్వుతాడు)

తా:—పద్మినీ! ఇతను బ్రహ్మచారిటే, పాపం! (ఇద్దరూ నవ్వుతారు)

ప:—(చెక్కుచెదరకుండా డ్రింకు తాగేసి, షోకుగా మూతి తిప్పుకుంటూ) 'వెరీ సారీ!' (అని, బకాళాబాత్ పళ్లెం అందుకుంటుంది. సెర్వర్ నవ్వుతాడు. ప్రభ అటూ ఇటూ చూసి, పారిపోదామనుకుంటూండగా, ఇంకా కొందరు అమ్మాయిలు అవతలినుంచి చూసి, నవ్వు అందుకుంటారు)

ప్ర:— (కంగారుగా సెర్వర్‌తో) బోయ్! ఈపద్మవ్యూహంనుంచి బయట పడడం ఎలాగ? (పద్మినీ తారల వైపూ, అవతలి అమ్మాయిల వైపూ బెదురుగా చూస్తూ) 'ఫ్రంటల్ ఎట్టాక్' తప్పించుకోడానికి 'డన్కర్క్' చేద్దామనుకుంటే, 'రేర్ ఎట్టాక్' తప్పదు. అనుకోకుండా 'లేడీస్ పిన్సర్స్'లో చిక్కుకున్నానే! ఏమిటి దారి?

(పద్మినీతారలతోపాటు, సెర్వర్ కూడా, జవాబివ్వక నవ్వుతాడు)

ప్ర:—ఓరి వెకిలీ! నువ్వూ నవ్వడమే? 'సో మెనీ పాట్స్ ఎట్ వన్ బర్డ్' అయిపోయిందే, నా పని!

సె:— (నవ్వుతూ) రొంబ ట్రబులే!

ప్ర:—అవును. మగ స్టూడెంట్స్‌కన్నా వెకిలిగా ఉన్నారే, వీళ్లు!

ప:—(వెటకారంగా) అమ్మో! ఈ ఋష్యశృంగులు ఆక్షేపిస్తున్నారేవ్! ఇంక మనం వెకిలిగా ఉండొద్దే, తారా! చాలా 'సీరియస్'గా ఉందాం. ఏం?

ప్ర:— (సర్వర్‌తో) ఎలక్కి ప్రాణపోకటా, పిల్లికి చెలగాటం! వాళ్ళకేం? వేళాకోళం చేస్తారు!

సె:—ఇంగె యారు పిల్లి, యారు ఎలక సార్?

ప్ర:—నీ మొహం! (ఏమీ పాలిపోక, వెంగగా) ఉండా లేను, వెళ్లా వేను! వెళ్లాలంటే అవతలున్న ఆ 'అమెజాన్స్' దారివ్వరు! (ఆ అమ్మాయిలు నవ్వుతారు) ఉండాలంటే, లోపలున్న ఈ 'హీరోయిన్స్' సీటివ్వరు, ఎలాగ? (పద్మినీతారలు, నవ్వుతారు)

సె:—'ట్రై' చెయ్యండి, సార్!

ప్ర:— (నిస్పృహతో) ఏం 'ట్రై' చెయ్యను? ఈ 'కమ్యూనిస్ట్' పద్మిని, తన తాత సొమ్ములాగ నా డ్రింకు సొంతం చేసుకుంది కదా! డ్రింకు సొంతం చేసుకుంటేనే ఇంత బాధ పడుతున్నానే, ఎవరైనా నన్నే సొంతం చేసుకుంటే చెప్పాలా, నా అవస్థ.

ప—(తారతో) మనమీదా ఏమిటో, ఆ 'హిట్?'

సె:—వాళ్లు అందమాదిరి సొంతం చేసుకునే 'సైన్స్' ఏమైనా కనుపిస్తూన్నాయా ఏమిటి సార్?

ప్ర:—(వణుకుతూ) కొంపతీసి ఆ 'సైన్సు' నీకేమైనా కనుపించాయా, యేమిటి, బాబూ? తెలిస్తే చెప్పెయ్; పుణ్యం ఉంటుంది.

సె:—(నవ్వుతూ) ఇల్లై, సార్!

ప్ర:—ఏం చెయ్యను? అమ్మగారు ఆహారసమస్య అలా పరిష్కారం చేస్తూంటే, ఇలా నిలబడుండనా, పెద్ద 'బట్లర్'లాగ?

సె:—ఎదికి నిక్కరిడె సార్? వాళ్ళనడిగితే 'హాఫ్ సీట్' ఇస్తురే!

ప్ర:—షటప్!

ప:—(తారతో) వచ్చినవా డెలాగా వచ్చాడు! కావలిస్తే, నా సీట్లో సగం ఇస్తాను. ఇలా దయచెయ్యమను.

ప్ర:—ఛీ, ఛీ, ఛీ! పాపం శమించుగాక!

తా:—(పద్మినితో) ఆయనగారు బ్రహ్మచారన్న మాట మరచిపోకే, బాబూ!

ప:—పోనీ, నిలబడమను; నాకేం? (మళ్లీ టిఫిన్ తింటూ ప్రభవైపు తిరిగి) ఏయ్! బోయ్! ఓ కప్పు కాఫీ తే! (అనేసి, చూసీ చూడనట్లు నటించి, నాలుక కరచుకొంటుంది.)

తా:—అయ్యయ్యయ్యో! ఎంత మాటనేశావే, ఉండుండీ!

సె:—(నవ్వుతూ) నిలబడుంటే, ఇదిదా 'డేంజర్' సార్!

ప్ర:—(సెర్వర్‌తో) చూశావా, వాటం? నీకూ నాకూ ఒకే

'స్టేట'స్సా? 'బోయ్' అనేశాక, నాలుక కరచుకుంటే మట్టు కేంలాభం? ఎంత 'ఇన్సల్ట్' నాకు! ఈ రెండో పిల్లే నయం! కాస్త 'సెన్స్' అయినా ఉంది.

ప:—(నవ్వుతూ) 'ఎక్స్‌క్యూజ్ మీ బోయ్!' (నాలుక కరచుకొని) అం అం! కాదు, కాదు! 'ఎక్స్‌క్యూజ్ మీ సర్'
(మళ్ళీ టిఫిన్ తింటూంటుంది.)

ప్ర:—(కొంచెం సంతోషంగా, సెర్వర్‌తో) 'ఎక్స్‌క్యూజ్' అనే మాట వాడడం కొంత నయమే. 'సర్' అని కూడా అంది; గుడ్డిలో మెల్ల!

సె:—అవు, సార్!

ప్ర:—(టిఫిన్ తింటూ తలవంచుకొని ఉన్న పద్మని ముఖాన్ని పరీక్షించిచూసి సెర్వర్‌ని ప్రక్కకు పిలిచి) నేను ఇదివరకు ఏ స్త్రీముఖాన్నీ ...ఇలా... చంద్రకాంతులు, ఇంత అందంగా, కళాయి చెయ్యడం చూడలేదు.

సె:—ఇదిదా మొదలు సార్?

ప్ర:—అవును. ఈ అమ్మాయికళ్ళు, చంద్ర కిరణాల మధ్య, 'రేడియం డయల్స్'లాగ, తళుక్ తళుక్‌మంటూ ఉండడంవల్ల (కళ్ళు నలుపుకొంటూ) అబ్బ! తేజెక్కువై పోయి, చూపు ఆనడం లేదు. ఒక్క నిమిషం కళ్ళు గట్టిగా మూసుకుంటాను, ఉండు. (అంటూ మూసుకుంటాడు)

సె:—(నవ్వుతూ) వాళ్ళుచూస్తే నవ్వుతారు, సార్! తెరవండిమీా!
(వాళ్లు దొంగ చూపులు చూస్తూ, ముసిముసి నవ్వులు నవ్వుతుంటూనే ఉంటారు.)

ప:—(సెర్వర్‌తో కొంచెం ఏకాంతంగా) అందమైన ఆ లేత కళ్లు, ఆ బెంగాలీ కట్టూ చూస్తే, (నణికి) కొంపతీసి, ఈ పద్మిని నాకు ఫోటో పంపిన పద్మినేమో అని భయం. (కంగారు పడతాడు)

సె:—ఎన్ని ఫోటోలు, సార్?

ప:—నీకు తెలియదులే; ఊరుకో!

ప:—(ఇదంతా వినన్నట్లు నటిస్తూ తాతతో) మా 'ఫాదర్' వ్రాసిన ప్రకారం 'హాస్టల్'నుంచి 'పర్మిషన్' తీసుకుని వచ్చాను

తా:—ఎందుకూ?

ప:—ఆ ఊరినుంచి వచ్చిన పెళ్లివారికి దర్శనం ఇవ్వాలిగా? రా, పోదాం. (అంటూ ప్రభవైపు 'రొమాంటిక్'గా చూస్తుంది (ప్రభ, నానా కంగారూపడి, గుటకలు మింగుతాడు)

తా:—(ప్రభను చూపిస్తూ) ఇలాంటి మహా ధైర్యశాలిని చేసుకో, తరిస్తావు! (సెర్వర్ నవ్వుతాడు)

ప్ర:—(చాలా కంగారుగా సెర్వర్‌తో) ఆఁ ఆఁ! అదోలా, గమ్మత్తుగా. ....అ....అ....అలా చూస్తుందేఁ ఆ అమ్మాయి? ....వ....వ....వద్దని చెప్పు!

సె:—అదిదా వాళ్ళకి మామూలు; సార్!

ప్ర:—(కళ్లు మూసుకొని తూలుతూ) ఇలా కళ్లు చీకట్లు కమ్మేస్తున్నాయేఁ?

సె:—(కంగారు పడుతూ, ప్రభని పట్టుకొని) అడడడా! భయం ఇల్లే సార్!

ప్ర:—(ఫైంట్ అవఁబోతూ) బోయ్! ....పట్టుకో! ....పట్టుకో! పడిపోతూన్నా!

సె:—(పట్టుకొని, కంగారుగా. పద్మినితో) ఎన్నమ్మా? రొంబ ట్రబులే!

ప:—(సెర్వర్‌తో ఏకాంతంగా) మరేం కంగారు లేదు. (కొన్ని రూపాయలు చేతిలో పెట్టి) ఈయన్ని నెమ్మదిగా ఓ టాక్సీలో ఎక్కించి, వై. యం. సి. యే. లో జాగ్రత్తగా దిగ బెట్టించెయ్యి. ఓ రూపాయ నువ్వు తీసుకో.

సె:—(దండం పెట్టి) అదిదా చేసి పూడుస్తును.

(పద్మినీ తారలు నవ్వుతూ వెళ్లిపోతారు.)

# నాలుగో రంగం



(వై.యం.సి.యే.లో ప్రభ కుటుంబంవారు దిగినగది—తొట్రుపాటుతో ఆంజనేయ దండకం చదువుతూ, ప్రభ వస్తాడు.)

ప్ర:—"శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం. ప్రభాదివ్యకాయం, ప్రశస్తప్రకాయం, ప్రకీర్తిప్రదాయం, భజే వాయుపుత్రం, భజే వాలగాత్రం, భజేహం పవిత్రం" (దండకం ఆపి, కావలివాడితో) మావాళ్లేరయ్యా?

కావలివాడు:—'బ్రహ్మచారి'కి వెళ్ళారు, సార్!

ప్ర:—(షాక్ అయి) అశ్లీలం! పాపం శమించు గాక! బ్రహ్మచారికి వెళ్ళడమేమిటిరా, నీ మొహం!

కా:—'బ్రహ్మచారి' ఫిలింకి వెళ్ళారు, సార్! సాపాటు చేసి మిమ్మల్ని కూడా రమ్మన్నారు. సార్!

ప్ర:—సాపాటూ వద్దు, ఏపాటూ వద్దు, నాపాటు నాదే!

కా:—అలాగున్నారేం సార్?

ప్ర:—ఏమీలేదు కాని, ....ఆ.....ఆ అమ్మాయి ఆఖరిమాటలు తలచుకుంటే, పైె చలితోపాటు (వణుకుతూ) లోపల భయంకూడా వేస్తూంది.

కా:—ఆమ్మాయి యెవరు సార్?

ప్ర:—నీ నెత్తి! ఏదో కంగారులో మతిపోయి నీతో అనేస్తున్నానేమిటి? (కొంతసేపు ఆలోచిస్తాడు, కళ్లనీళ్లు తిరుగుతాయి) నా 'బ్రహ్మచర్య రహస్యం' ఏదీ?

కా:—మీ రహస్యాలు నాకెలా తెలుస్తాయి సార్?

ప్ర:—ఓరి, మందకోడీ! ఇందాకా మంచంమీద పెట్టానుకాదూ నా పుస్తకం?

కా:—అదా అండీ? ఆ బల్లమీద పెట్టాను సార్!

ప్ర:—(పుస్తకం తెరిచేటప్పటికి దానిమీద కన్నీళ్లురాలతాయి. కళ్లుతుడుచుకుంటూ, డగ్గుత్తికతో) సరిగ్గా ఈ పుస్తకంమీదే కన్నీరు రాలడం, నా బ్రహ్మచర్యానికి నీళ్లు వదలడం కాదు గదా?

కా:—ఎందుకు సార్, అలా విచారిస్తారు? అయ్యగారు ఇష్టం లేని పెళ్లి చేస్తామంటూన్నారా?

ప్ర:—(కోపంగా) నోరుముయ్! పో!

కా:—సరిదా, పూడుస్తును. (వెళ్ళిపోతాడు, ప్రభ తలుపువేస్తాడు)

ప్ర:—(పుస్తకం తెరిచేటప్పటికి ఎవరో తలుపు తట్టుతారు, ప్రభ భయంతో గట్టిగా) Beware bachelor, Away from the web. (మళ్లీ తలుపు తట్టు; వణుకుతూ) ఎవరు వారు? (జవాబు లేదు. మళ్లీ తలుపు తట్టు. గుటకవేస్తూ, నెమ్మదిగా తలుపు తెరుస్తాడు. ఎదుట పద్మిని ప్రత్యక్షం అవుతుంది. సినిమాలో దొంగలాగ చేతులెత్తి ప్రభ ఒక్కొక్క అడుగే వెనక్కి వేస్తూంటే, కింగ్‌కాంగ్ లాగ బరువుగా అడుగులేస్తూ పద్మిని లోపలికి మార్చియి వస్తుంది.)

ప:—(సీరియస్‌గా) సిట్ డౌన్!

(ప్రభ, పద్మినికి కుర్చీ చూపించి, మంచంమీద కూర్చుంటాడు. ఆవిడా మంచంమీదికే వస్తుంది. కంగారు పడిపోతుంటే, దగ్గర దగ్గరగా జరుగుతుంది. ముడుచుకుపోతాడు. నవ్వుతుంది; కుర్చీలోకి పోబోతాడు; చెయ్యి అడ్డు వేస్తుంది; ఎక్కడ ఒళ్ళుతగులుతుందో అన్నట్లు కూర్చుంటాడు. అట్టహాసం చేస్తుంది.)

ప్ర:—(కొంచెం తెగించి) మావాళ్లు...ఇంట్లో,...!

ప:—తెలుస్తూనే ఉంది.

ప్ర:—అందుచేత...వాళ్లని....రేపు....

ప:—మరేం తొందరలేదు. కలుసుకునే వెడతా.

ప్ర:—తమకు....పొద్దు పోతుందేమో?

ప:—ఆ విషయం తమరేమీ శ్రమపడకండి, పాపం!

ప్ర:— పోనీ....మీరెవరో దయచేసి చెప్తే....మానాన్నగారు వచ్చాక....

ప:—(చిరునవ్వుతో) ఈలోగా మీరున్నారుగా?

ప్ర:—(రాని నవ్వుతో) అందుకు కాదండి. (ఆవులిస్తూ) కొంచెం ....నిద్రవేళైంది....దయచేసి,....

ప:—అంత సులభంగా దయచేసేదాన్ని కానండోయ్! 'గెస్టన్' వచ్చినప్పుడు ఇలా నిద్రపోతాననడం మర్యాదా?

ప్ర:—(వెర్రినవ్వుతో) ఏదో, తండ్రి చాటు వాణ్ణి! నా కీమర్యాదలు...అంతగా తెలియవండీ!

ప:—అవునవును. తండ్రిచాటున ఉన్నంతకాలం, అంతే!

ప్ర,—మావాళ్లు....సినీమాకి వెళ్లారండి.

ప:—ఓహో! మరీమంచిది!

ప్ర:—("స్టన్" అయి) ఆఁ! రేపు మావాళ్లు తీరుబడిగా ఉంటారు; అప్పుడు రండి.

ప:— (నవ్వుతూ) ఆఁ! మీరు 'ఫ్రీ'గా ఉన్నారు, చాలదూ?

ప్ర:— (కంగారుపడి) సోదరీ! క్షమించి రేపు రండి.

ప:—పెళ్ళయేదాకా అంతా సోదరీ సోదరులే!

ప్ర:—(కంగారుపడి) చూశారా? మీరు....స్త్రీలు....

ప:—(వేళాకోళంగా) కొత్త పోయింట్ చెప్పారే!

ప్ర:—అందులోనూ, పరస్త్రీలు.

ప:—అదే పొరపాటు. పరస్త్రీనని యెవరుచెప్పారు? మీతోడు! మీదాన్నే!

ప్ర:— ప్లీజ్! ఆ బంధుత్వాలేవీ నాకు తెలియవు. తమర్ని నే నెరగను. క్షమించి విడుదల లిప్పించండి.

ప:—ఇంత 'డౌన్‌రైట్'గా అబద్ధాలాడేవారు, హృదయం ఎలా ఇస్తారండీ?

ప్ర:—(ఆశ్చర్యంగా) ఇస్తాననాన్నా? ఏమిటి? నేనా? రామరామ!

ప:—వేరే అనాలా? అయినా నాకివ్వకపోతే, మరెవ్వరి కిస్తారు లెండి!

ప్ర:—ఒట్టు! నే నేస్త్రీకీ ఏమీ అర్పించలేనండీ!

ప:—ఆఁ, కొయ్యకండీ!

ప్ర:—అయ్యో! మీ జాతంటేనే భయం నాకు.

ప:—భయం ప్రసిద్ధంగా వెల్లడౌతూనే ఉంది. అయినా, తెలియక అడుగుతాను. హృదయం అర్పించ ననడానికి మీకేం హక్కండీ?

ప్ర:—(తెల్లబోయి) అదేవిఁటండోయ్! నా హృదయం నాహక్కే!

ప:—'నా టెటాల్!' ఎప్పుడూ. పురుషుడి హృదయం స్త్రీది; స్త్రీ హృదయం పురుషుడిదీను. జ్ఞాపకం ఉంచుకోండి.

ఇంతకీ మీ హృదయాన్ని అర్పించేటట్లు చేసేదాన్ని నే నున్నాగా?

ప్ర:—అయ్యో! అందుకే, పాపం, 'బ్రహ్మచర్య రహస్యం'లో చెప్పనే చెప్పాడు.

"స్త్రీల ప్రేమొక సాలెపట్టు - దాన్ని తాకిన ఆటకట్టు;
పట్టుపడితే, వట్టిరట్టు - వద్దు బాబూ! ఒట్టు! ఒట్టు!
రగడు తేరిన మగువ సాలె - తారసిల్లిన దానిపాలే;
ఆమె తెరచిన ప్రేమజోలె-బ్రహ్మచారికి బల్ దివాలే!"

ప:—(పకపక నవ్వుతూ) దీనికి మా 'ప్రేమ రహస్యం'లో ఏం జవా బిచ్చారో తెలుసా?

"సాలె పడుచుకు ప్రేమధర్మం - బ్రహ్మచారికి ఆదే కర్మం
తెలుసుసాలెకు దానిమర్మం . నీకు దిక్కా- పరబ్రహ్మం!
సాలెనాటిన ప్రేమమొలక - పెరిగి తీరును, ఆమెకులుక;
ఎందుకయ్యా వృథాఅలుక-దొరకునయ్యా నీదు పిలక!"

ప్ర:—(బెదురుతూ) అయ్యయ్యయ్యో! ఇదేం కర్మం బాబూ! ఏపాపం ఎరగని నన్ను...ఇలా....చిత్రాంగిలాగ....

ప:— (నవ్వుతూ) మానసహారా! సారంగధరా! కంగారుపడకండి మిమ్మల్ని లొంగదీసి,....

ప్ర:— (కంగారుగా) ఆఁ!

ప—ఆఁ, అదే. మిమ్మల్ని మచ్చికచేసి, పెళ్లాడగలిస్తే, ఏ

అభ్యంతరమూ లేదని, మీవాళ్లు నాకు 'వకాలత్' ఇచ్చారు.

ప్ర:—మధ్య వాళ్ళకేం?

ప:—నాకా శక్తి ఉంది గనక,

ప్ర:—(గాభరాగా) అయ్యో బాబోయ్! చివరికి బ్రహ్మహత్యకే పూనుకున్నారన్నమాట! 40 కోట్ల జనాభాలోనూ, నేనే దొరికానా తల్లీ! పెళ్లికి!

ప:—'యస్'!

ప్ర:—(ప్రాధేయపూర్వకంగా) బ్రతిమాలుకుంటూన్నా! నాకు శృంఖలాలు తగల్చకండి, బాబూ: పెళ్ళంటే, నా బ్రహ్మచర్యవ్రత భంగం, నాయావనం ధారపోయడం, ధర్మయుద్ధంలో ఓడిపోవడం, నా వ్యక్తిత్వం చంపుకోవడం,

ప:—ఊఁ, ఇంకా యేమిటి?

ప్ర:—నన్ను మీకు అమ్మకుని, కీర్తిశేషుణ్ణి కావడం అన్నమాట! (జాలిగా) నాకా దుర్గతి తప్పించమని వేడుకుంటూన్నాను, 'ప్లీజ్, ప్లీజ్!'

ప:—(విజయగర్వంగా నవ్వుతూ) మిమ్మల్ని పెళ్లాడబోతూన్నానంటే, పై బాధలన్నీ నేనూ పడాలన్నమాటే కాదూ?

ప్ర:— (పాలిపోయి తల తడువుకుంటూ) మీకేం? ఓర్చుకో గలరు. వజ్రంలాంటి గుండె!

ప:— (వెటకారంగా) మీకేం, మొగాళ్లు!

ప్ర:—కాను బాబూ, కాను. ఇది కలికాలం. మీరు మొగన్నర

అబ్బాయిలు. నాకు ఆసక్తే లేదండి. ఏదో మొదటి నుంచీ తండ్రిచాటువాణ్ణీ, అర్భకుణ్ణీ అని, మొదటే మనవి చేసుకున్నా.

ప:—(నవ్వుతూ) మీలాంటి అర్భకులకే 'లవ్' ఒక 'టానిక్' లెండి!

ప్ర:—అయ్యో! ఎంత అన్యాయం! ఎంత ఘోరం! ఎంత కలి కాలం! శుకమహర్షి వంటివాణ్ణి నన్నొక్కణ్ణిచేసి, ఇలా 'లవ్' అనీ, 'గివ్' అనీ, 'బ్లాక్ మైల్' చెయ్యడం న్యాయమా?

ప:—'షేమ్, షేమ్!' 'లవ్' అంటే భయపడమన్నవా రెవ రండీ?

ప్ర:—ఒకరనాలా? నాకా రకం కోరికలే లేవండి. అందుకే, "Desire is the root - cause of all misery" —"అన్ని కష్టాలకీ మూలకారణం కోరిక"—అన్నాడు బుద్ధుడు.

ప:—అందుకే, "Never resist temptation" —"కోరిక ఎప్పుడూ చంపుకోకు"—అన్నాడు బెర్నార్డ్ షా.

ప్ర:—షా వ్రాతలు చదివి, మతి పోగొట్టుకున్న వారిలో మీ రొకరన్నమాట?

ప:—చండీదాస్, విద్యాపతి, లైలా మజ్నూ, అనార్కలీ మొదలైన ఫిలిమ్స్ ఏవైనా చూశారా? అసలు సినిమాలు చూస్తూంటారా?

ప్ర:—ఏవో చచ్చు 'ఫిలిమ్స్', లక్షలు చూస్తూన్నాం, ఈ రోజుల్లో!

ప:—ఇంకేం? అన్నీ 'ప్రేమ'నే కదా వెద జల్లుతూన్నాయి? చూడండి కావలిస్తే, (అని, కొన్ని సినీమా పాటల పల్లవులు పాడుతుంది)

"ప్రేమ్ క హై ఇస్ జగమే పంథ్ నిరాలా!"

"ప్రేమే నేరమౌనా? నా పైని పగేలా?" (మొదలైనవి)

ప్ర:—(చెవులు మూసుకుని) బాబోయ్! నాకీ సినిమా ప్రణయ వేదాంతం అర్థమే కాదు.

ప:—ఓహోహో! అపర విశ్వామిత్రులు! ఆశీర్వదించండి, స్వామీ! మీ భక్తురాల్ని! (మోకరిస్తుంది)

ప్ర:—("రెస్ట్‌లెస్"గా "ఫీల్" అవుతూ) తమరిలా సెలవిస్తే ఎలాగ? మా బ్రహ్మచారుల నిఘంటువులో ప్రేమ అన్నమాటే లేదు.

ప:—(ఆక్షేపణగా మొత్తుకుంటూ) మా కన్యల నిఘంటువులో ఎక్కడ చూసినా, అదే!

ప్ర:—ఈ కలికాలంలో, 'అష్టవర్షాద్భవేత్కన్య'లే కొంప ముంచేస్తూంటే, మీ అంతటి కన్యల్ని తట్టుకోగలమా?

ప:—తప్పు మాటలాడకండి. ఇదిగో! ఇలా చూడండి! సిగ్గు నటిస్తారేం?

ప్ర:—నటించానా?

ప:—ఇదిగో, ఇలా నా కళ్ళల్లోకి చూడండి!

ప్ర:—(సవినయంగా) అలవాటు లేదండీ!

ప:—లేకపోతే, నేర్చుకోవాలి. (సగర్వంగా) వెన్నెలలాంటి నా

యౌవనం, ఈ శీతల పవనాలు, ఈ వెండి చంద్రుడి పండు వెన్నెల—ఏవీ, మిమ్మల్ని ఆకర్షించడం లేదూ?

ప్ర:—అయ్యో! నిరాయుధుణ్ణి! మీమాటలు నాకు ఏ 'డిక్షనరీ' చూసినా అర్థంకావు.

ప:—అవి, డిక్షనరీ చూస్తేఅర్థమయేవి కావు; (వికాసంగా, రెప్ప వాల్చకుండా చూస్తూ) నన్ను చూడాలి!

ప్ర:...(కంగారుతో, ఒక పెద్ద "గ్లేర్"ని చూసినట్లు కళ్లు చికిలిస్తూ) ఆఁ, ఆఁ! కరుణించి, తమ చూపులు, ఆ రకంచూపులు ఉపసంహరించాలి.

ప:— (అలాగే చూస్తూ) ఏదీ! తాత్కాలికంగా నేను ఏ శకుంతల్నో అనుకుంటాను. మీరు ఏ దుష్యంతుణ్ణో అనుకోండి, చూద్దాం!

ప్ర:— (తెర నవ్వుతో) కానూకాను; అనుకోనూ లేను.

ప:—మీరు తెలియక పోవచ్చు, పాపం! మీరు నిజంగా మన్మథులు!

ప్ర:—అబ్బే!

ప:—మీ ముఖం చంద్రుడు; మీ నవ్వు వెన్నెల; ఇలా చూడండీ! మీరు అచ్చు అశోక్‌కుమార్‌లాగున్నారు.

ప్ర:—అబద్ధం! అబద్ధం! అయ్యో, పద్మినిగారూ! చాలామంది కాలేజ్ గరల్స్‌లాగ, మీరూ 'సినిమా ఇన్‌ఫ్లుయన్స్' లోపడ్డారా? నేను 'స్టార్'నీ కాను, 'స్టార్ వాల్యూ' అంతకన్నా లేదు.

ప:—ఉంది, ఉంది, ఉంది! ఎవరి 'వాల్యూ' వారికి తెలియదు.

ప్ర:—నా 'క్లాస్‌మేట్స్'లో సగం మంది అమ్మాయిలే.

ప:—(వెటకారంగా) ఓ!, 'ఐ సీ!'

ప్ర:—అయినా, వారెవరూ, ఇంత 'డేంజరస్లీ ఎగ్రసివ్'గా నన్ను బాధించలేదు.

ప:—నేను మీ 'క్లాస్‌మేట్'ని కానన్నది మొదటి విషయం. తరవాత, మిమ్మల్ని ఎవరూ నా అంత 'ఎగ్రసివ్'గా బాధించలేదన్నారు. అంటే, నా అంత కాకపోయినా, కొంత 'డేంజరస్'గా బాధించారన్నమాటే! అమ్మా! చెప్పారే కాదూ!

ప్ర:—ఛీ, ఛీ, ఛీ! ఒట్టు, మీ తోడు. ఆ అమ్మాయిలతో నే నెప్పుడూ మాటేనా ఆడలేదు.

ప:—అయితే మరీ మంచిది. మీరొక 'అనాఘ్రాతం పుష్పం' అన్నమాట! నాకు కావలసిందే అది. అందుకే, దేవుడు నన్ను ఎకాయెకీని మీ 'లైఫ్‌మేట్'గానే సృష్టించాడు.

ప్ర:—(బెంగగా) లేనిపోని 'లిటిగేషన్' తెచ్చి పెట్టారే! నాకు లేని ప్రేమ మీకుంటేమట్టు కేంలాభం?

ప:—నాకు లాభమే!

ప్ర:—రెండుపక్షాల్లో ఎవరికి ప్రేమ లేకపోయినా, ఆ సంబంధం తుపానుగా మారుతుంది. నా మాట వినండి, 'ప్లీజ్'!

ప:—రెండు పక్షాలకీ ఉండవలసినంత ప్రేమ, నాకే ఉంటే?

ప్ర:... (ఉలికిపడి) మరీ ప్రమాదం!

ప:—ఏమో! నేను 'లవ్' చెయ్యడమే నాకు ప్రధానం. (నడుము బిగిస్తూ) తరవాత మీరెలా 'లవ్' చెయ్యరో నేనే చూస్తా కాదూ!

ప్ర:—(బెంగగా) అంతే? అంత జబర్దస్తీయే? పాపం, చెప్పనే చెప్పాడు. మా 'బ్రహ్మచర్య రహస్యం'లో!

"సాలెపడుచుకు ప్రేమతిండి - అయ్యగారది ముట్టకండి!
అమ్మగారో, పట్టిమొండి - అయ్యగారూ తప్పుకోండి!
ప్రేమసాలెకు పిండివంట - బ్రహ్మచారికి రేగుమంట!
ఆమెచూచిన వాలుగంట - బ్రహ్మచారికి గట్టితంట!"

ప:—(నవ్వుతూ) బ్రహ్మచారికి ఎలాగైనా తంటాయే, పాపం! అయితే, మా 'ప్రేమరహస్యం'లో ఏమన్నారో తెలుసా, మరి?

"సాలెపడుచుకు ప్రేమదాహం - బ్రహ్మచారుల పాలివ్యామోహం
గట్టిదయ్యా ఆమె మోహం - ఆమెపాలే వానిదేహం"

(ప్రభ పాలిపోక, తల తడువుకుంటూ కూర్చుంటాడు)

ఇదుగో! చెపుతూన్నా, వినండి. నాది గాఢమైన ప్రేమ. దాన్ని ఏవీ అడ్డలేవు.

ప్ర:—ఇలా గడబిడ చేసేవారికి, గాఢమైన ప్రేమేమిటి?

ప:—ఓసోస్! ఎంతసే పీ కపట నాటకం? (మీద చెయ్యేస్తుంది)

ప్ర:—(తప్పించుకొని) అమ్మయ్యో! ఇదో రకమైన పిచ్చే! ఇది మామూలు ప్రేమకాదు. 'జట్ ప్రొపెల్డ్, ఆటమిక్ రొమాన్స్!' ప్రతిఫలం లేని ప్రేమ మంచిది కాదు.

పద్మినిగారూ! క్షమించరూ?

ప:—క్షమించను. మిమ్మల్ని పెళ్లాడితీరతానని మొక్కుకున్నాను.

ప్ర:—ఓయి బాబోయ్! ఏ దేవుడికి?

ప:—మన్మథుడికి.

ప్ర:—చెల్లించలేని మొక్కులెందుకు మొక్కుతారూ, పాపం?

ప:—అలాగా? అయితే, కాసుకోండి, మరి!

ప్ర:— (డీలాపడి) 'ఛాలెంజ్' చెయ్యకండీ! నిరాయుధుణ్ణి! (బ్రతిమాలుతూ) ఒక్క మనవి!

ప:—ఏమిటది?

ప్ర:—నేను..., పెళ్లి మొదలుకొని కళ్లీవరకూ, అన్ని 'స్టిమ్యులెంట్సూ' కాశీలో విడిచిపెట్టానండీ! మన్నించండీ!

ప:— (వస్తూన్న నవ్వు ఆపుకుంటూ, లేని కోపం నటిస్తూ) ఈ దొంగ ఎత్తులు నాదగ్గర సాగవు. ఆఖరిసారి 'వార్నింగ్' ఇస్తూన్నా! మీరు సుముఖులైతే, నా ప్రేమ మహాలక్ష్మి; విముఖులైతే, మహాకాళి! జాగ్రత్త!

ప్ర:— (వణుకుతూ) అయితే, నన్ను మానభంగం చెయ్యదలచుకొన్నారన్నమాట!

ప:—ఇదే నా 'అల్టిమేటమ్!' ఒప్పుకోడానికి 5 నిమిషాలు గడువు. అది దాటిందా... (అంటూ నడుం బిగిస్తుంది కళ్లెర్రజేసి. ప్రభ కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి. రుమాలు మొగానికి అడ్డు పెట్టుకుంటాడు)

ప:—మీరు ఇలా దుఃఖిస్తే, నాకూ ఏడుపొస్తూంది. జాలీ వేస్తూంది. ఈసారి మిమ్మల్ని అసలే వదలలేను. (మీద

చెయ్యేసి, విదళించుకున్నా, తీయదు) మీ భయం, బ్రహ్మ చర్యం, ఈ కన్నీళ్ళతో కొట్టుకుపోతాయి. ఎందుకో కాని, మీ యేడ్పులో నాకో ఆశ కనబడుతూంది.

(బలవంతాన్ని ప్రభ ముఖం తనవైపు త్రిప్పికొని)

"కన్నీటి కెరటాల వెన్నెలేలా?

నిట్టూర్పు గాడ్పులో నెత్తావియేలా?"

(లేచి నిలబడి, గంభీరంగా) ఇంక సందేహించను.

ప్ర:—(ఏడుపు గొంతుతోనే) ఏమిటండోయ్?

ప:—(నడుం బిగిస్తూ) ఆడేస్తా!

ప్ర:—ఏ ఆట?

ప:—మిమ్మల్ని పెళ్లాడేస్తా!

ప్ర:—నన్నే?

ప:—ఆ!

ప్ర:—(కళ్ళద్దుకుంటూ) రంగూన్ రౌడీ అనే పతి భక్తిలాగ, ఇదేమిటి బాబూ! అప్పుడే నన్ను మీ అర్ధాంగుడుగా మార్చేస్తారా?

ప:—నే మార్చేదేమిటి? మీరే మారిపోతూన్నారు.

ప్ర:—'ఎడ్వర్డ్ VIII' ని 'మిసెస్ సింప్సన్' పట్టుకున్నట్లు, పట్టుకున్నారే నన్ను! ఇంక పై 'అప్పీల్' లేదా?

ప:—(లేదని తలూపుతుంది)

ప్ర:—(జాలిగా) మిస్ పద్మినిగారూ! మీలాంటి వీరవత్నుల్ని తట్టుకోలేనండీ!

ప:—మిస్సూ లేదు, గిస్సూ లేదు. ఇంక మీరు నన్ను 'మిస్' అనడం, నేను మిమ్మల్ని 'మిస్' అవడం, అసంభవమే!

ప్ర:—న్యాయం ఆలోచించండి. ఈ ఎలక్ట్రిక్ దీపం సాక్షిగా చెపుతున్నా. మనోవాక్కాయ కర్మల్లో దేనిచేతా, ప్రభాకర్ అనే నేను, పద్మిని అనే మిమ్మల్ని, క్రిందటి జన్మలో కాని, ఈ జన్మలో కాని, ఏ విధంగాను బాధించినవాణ్ణి కాను. కనక, విడుదల లిప్పించండి, 'ప్లీజ్'

ప:—ఏమిటీ! ఏ జన్మంలోనూ మీకూ నాకూ సంబంధం లేదంటారా? నాకు, ఆనీబెసెంట్‌లాగ, గతాన్ని గ్రహించే దివ్యదృష్టి ఉందని తెలుసా? (కళ్లుమూసుకుని, ఊగుతుంది)

ప్ర:—(గడగడలాడుతూ) ఇదొకటి ప్రాక్టీస్ చేశారా, బాబూ?

ప:—(ఊగుతూ) ఊఁ, ఊఁ, ఊఁ!

ప్ర:—శాంతించండి మిస్సమ్మగారూ!

ప:—(ఊగుతూ) రెండు జన్మాల క్రితం, 'మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్'లో నేను దేవత, మీరు గాడిద; క్రిందటి జన్మలో రుక్మిణీ కల్యాణం అనే 'ఇలోప్‌మెంట్' నాటకంలో నేను కృష్ణుడు, మీరు రుక్మిణి.

ప్ర:—అన్నీ కోతలే!

ప:—'లాస్ట్, బట్ నాట్ ది లీస్ట్' ఈ జన్మలో, మనం స్టేజ్ లవర్స్, స్క్రీన్ లవర్స్, అసలు లవర్స్, ఒకటేమిటి? అన్నీ కూడాను!

ప్ర:—యక్షకిన్నెర గంధర్వుల్లో ఎవరినీ కానుగదా, అయినా, నా కీరాక్షస వివాహం తప్పదా?

ప:—ఏమో, మీ వ్రాత ఎలాగుందో!

ప్ర:—ఇదేం విపరీతం, మిస్సమ్మగారూ? ఎక్కడైనా పురుషుడు స్త్రీకోసం ప్రయత్నిస్తాడు కాని, శిరీషకుసుమకోమలులం అని చెప్పుకుంటూన్న స్త్రీలు ఇలా పురుషుల్ని వేటాడుతారా?

ప:—(జవాబు చెప్పక నవ్వుతుంది)

ప్ర:—పాపం, అందుకే మా పుస్తకంలో ఇలా మొత్తుకున్నాడు

"పుష్పశరాలు దరిసిరాగ - మగువ మమతలు ఒరసిరేగ
ప్రేమపాశం బిగిసిపోగ - బ్రహ్మచారికి బ్రతుకెలాగ?"

ప:—(నవ్వుతూ) అవును, నిజమే!

"బిగిసిపోవును సాలెపాశం - మెడకుతగిలిన గట్టిమోసం
చుట్టుకుందా మహాయాసం - గింజుకుంటే వృథావేశం"

ప్ర:—ఇంత కలికాలమా? వద్దంటే పెళ్లా? రాక్షస వివాహమా?

ప:—'అఫ్‌కోర్స్!' ఆకలేస్తే భోజనం చేస్తారా, లేదా? సుగంధ పుష్పం ఉంటే వాసన చూస్తారా, లేదా? అలాగే, ఇదీ ఒకవిధమైన ఆకలి, ఒకవిధమైన పిపాసాను.

ప్ర:—ఓయి నాయినో! ఇలాంటి ఆకళ్లుకూడా ఉంటాయన్న మాట! మీలాంటి ఆడబకాసురులు ఓ డజను మంది ఈ లోకంలో ఉదయిస్తే, మాలాంటి బ్రహ్మచారులకి

అ_స్తమయమే!

ప:—'నాన్సెన్స్!' ఇంత హృదయ పూర్వకమైన ప్రేమ అయా చితంగా అర్పిస్తూంటే, ఎక్కడా చలనం లేకుండా, బుద్ధ విగ్రహంలాగ కూర్చుంటే, ఎలా ఊరుకుంటాను?

ప్ర:—శిక్ష తప్పదా?

ప:—లేకపోతే, నాలాంటి 'ఎస్సెన్స్ ఆఫ్ రొమాన్స్'ని ఇలా తిరస్కరిస్తారా?

ప్ర:—అంత 'ఎస్సెన్స్' అయితే, ఆ ఘాటుకి ఆగగలనా?

ప:—ఈ 20-వ శతాబ్దంలో మీ పురుషులు 'బేక్ నంబర్స్' లోపడ్డారు. మళ్లీ ఏ శృంగార విప్లవమో రేగేదాకా, మీజాతికి పౌరుషం రాదు.

ప్ర:—(జాలిగా చేతులు నలుపుకుంటూ) పోనీ, అలాంటి చచ్చు జాతివాణ్ణి కదా, విముక్తి ప్రసాదించండీ.

ప:—'ఇంపోసిబిల్!' పూర్వకాలంలో పెళ్లికూతురు తలవంచుకుని ఉన్నంతకాలమూ పురుషుడు స్త్రీని 'పర్స్యూ' చేసేవాడు. ఇప్పుడా తలవంపులు మీకు సంక్రమించాయి. అందుచేత రోజులుమారాయి. స్త్రీయే పురుషుణ్ణి 'పర్స్యూ' చెయ్యడం మొదలు పెట్టింది. నాదీ ఈ పద్ధతే!

ప్ర:— (బెదురుతూ) ఈ సంగతి తెలుస్తే, మద్రాసే రాకపోదునే!

ప:—శక్తుంటే, 'క్రెడిట్' మీకే వచ్చేటట్లు చేసుకోకూడదూ!

ప్ర:—చేసుకోలేనండి, మిస్సమ్మగారూ!

ప:—'దెన్ ఐ కాంట్ హెల్ప్!' లొంగి పొండి!

ప్ర:—లొంగి పోనా? 'హెచ్ బాంబ్'లాగ వచ్చి పడ్డారే! అయ్యో! నాకు దిక్కెవ్వరు?

ప:—నేనే! (నడుము బిగిస్తూ, సీరియస్‌గా) నా 'అల్టిమేటమ్'కి 'జీరో అవర్' వచ్చింది. నా ఆకర్షణశక్తులు 'మేగ్నెట్స్'లాగా, మన్మథ బాణాల్లాగా మీ మీదికి 'మార్చ్' అయి వస్తూన్నాయి, కాసుకోండి.

ప్ర:— (వణుకుతూ) మిస్సమ్మగారూ! వాటిని రానీయకండీ, నా మీదకి!

ప:— (సీరియస్‌గా) ఆగలేరు సుమండీ! ప్రకృతిధర్మప్రకారం మీ రీవాతావరణానికి 'ఎడాప్ట్' అయిపోయి, 'ఇనీషియేటివ్' తీసుకుంటేనే తప్ప, రాక్షస వివాహం తప్పదు సుమండీ!

ప్ర:— (డగ్గుత్తికతో) అయ్యో! ఏమీ చెయ్యలేకపోతూన్నాను. నఖశిఖ పర్యంతమూ తిమ్మిరెక్కిపోయింది. ఒళ్లు తెలియడంలేదు. (పద్మిని సీరియస్‌గా ముందుకి "మార్చ్" అయి వస్తూంటుంది) "O! I am undone!" ప్రాణానికి తెగించి కళ్లు మూసుకుంటాను. (మూసుకుంటాడు)

ప:—అలా చెయ్యండి! శృంగారరసాధిదేవతయైన ఈ చంద్రుడే మన పురోహితుడనుకొని, నా 'నెక్లెస్' మీ మెళ్లో మంగళసూత్రంగా కట్టేస్తాను.

ప్ర:— (త్రుళ్లిపడి, కళ్లు తెరచి, సగంసగం ఏడ్పుగొంతుతో) అయ్యో! అయ్యో! చెప్పనే చెప్పాడు,

"ముట్టడించును సాలెమూక - కాసుకో అప్రపళయఢాక!
బద్ధకిస్తివ ముసుగుదాకా- సాలెఊదును ప్రేమబాకా!"

(మొత్తుకుంటూ) అయ్యో! అయ్యో! బద్ధకించాను, మునిగి పోతూంది! ప్రేమ బాకా వినుపిస్తూంది! బ్రహ్మచారీ! నీకు అస్తమయం సమీపించింది! (పద్మిని చలించక "నెక్లెస్" ప్రభ మెడ సమీపానికి తెస్తూంటుంది) మరచిపోయా! ఈ రోజు షష్టండీ! (దగ్గరగా వస్తూంటుంది) అయ్యో! ఇప్పుడు రాహుకాలమో, దుర్ముహూర్తమో— అని జ్ఞాపకం! (మెడమీద చెయ్యి వేస్తుంది) అయ్యయ్యయ్యో! ఒట్టు! నిజంగా ఇప్పుడు వర్జ్యం కూడా. (కట్టబోతుంది) కట్టకండి, కట్టకండి! ప్లీజ్, ప్లీజ్, ప్లీజ్! (కట్టడం ప్రారంభిస్తుంది) అయ్యో, అయ్యో! 'క్లోరోఫారమ్' ఇవ్వకుండానే ఈ ఆపరేషన్? అబ్బ! అబ్బ! (విదళించుకుంటూండగా కట్టేస్తుంది)

ఫ్యాన్:— (లోపలినుంచి) మీ వాళ్ళొచ్చారండి. తలుపు తియ్యండి సార్!

ప్ర:— 'ఎయిర్ రైడ్' జరిగిపోయాక 'ఫైర్ ఇంజన్స్' లాగ, ఇప్పుడొచ్చారా, వస్తారు?

ప:— ఇక్కడినుంచి నేను స్త్రీ, మీరు పురుషుడూ!

(అంటూ, తలుపు తెరుస్తుంది. ప్రభ తండ్రి, చెల్లెలు, రజనీ ప్రవేశిస్తారు)

చె:— (ప్రభ మెళ్లో "నెక్లెస్" చూసి, నవ్వుతూ) ఎవరు కట్టారా, ఈ పుస్తి?

రజని:—ఎవరేమిటి? అతన్ని రాక్షస వివాహం చేసుకున్నవారు!

తండ్రి:—ఎవరు కడితే ఏమిటోయ్, పుస్తి? మనకి కావలసింది, వాళ్ళకి పెళ్ళవడం! (పద్మినితో) ఏమంటావమ్మా?

(పద్మినీ ప్రభాకరుల చెయ్యీ చెయ్యీ కలిపి)

ఈ చంద్రకిరణప్రసారాలే మీకు మంగళస్నానాలు.

తదేవలగ్నం సుదినం తదేవ,
తారాబలం చంద్రబలం తదేవ,
విద్యాబలం దైవబలం తదేవ,
లక్ష్మీపతేంఽఘ్రియుగం స్మరామి!

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః!

# RĀKSHASA VIVĀHAMU

*Copies can be had from*:

V. V. L. PRABHAKAR, B.A.

ANASUYA PUBLICATIONS

~~32, RAMANS TREET~~, T. NAGAR,

MADRAS-17.